


పన్నెండు ముగించి పదమూడవ దానికి వెళ్తున్నారా?
చాలు, ఇప్పుడెంత షమస్య వుందో అంతుంది ముందు.
యుక్తవయస్సులో మొదలిడుతోంది సమస్య. ఆంప్రో
పదమూడవ బిస్కట్టుతో ప్రారంభిస్తోంది
తమాషా. ఈ పదమూడవ బిస్కట్ మిగిలిన
పన్నెండు బిస్కట్లలోను సమానంగా
పంచబడ్డ తృప్తికంటే మరెక్కువ తృప్తి
నిస్తుంది.

నేడే ఒక ఆంప్రో ప్యాకు కొని
ప్రయత్నించి చూడండి.

**ఆంప్రో®**

**గ్లూకోజ్ బిస్కట్లు**






aa/afp/6676







odomos
odomos
MOSQUITO REPELLENT

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**

**Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | ... | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road<br>Vadapalani, Madras-600 026 |
| 2. *Periodicity of Publication* | ... | MONTHLY<br>1st of each calendar month |
| 3. *Printer's Name* | ... | B. V. REDDI |
| *Nationality* | ... | INDIAN |
| *Address* | ... | Prasad Process Pvt Limited<br>2 & 3, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 4. *Publisher's Name* | ... | B. VISWANATHA REDDI |
| *Nationality* | ... | INDIAN |
| *Address* | ... | Chandamama Publications<br>2 & 3, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 5. *Editor's Name* | ... | NAGI REDDI |
| *Nationality* | ... | INDIAN |
| *Address* | ... | 'Chandamama Buildings'<br>2 & 3, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 6. *Name & Address of individuals who own the paper* | ... | CHANDAMAMA CHILDREN'S TRUST FUND<br>Beneficieries: |

1. B. V. HARISH
2. B. V. NARESH
3. B. V. L. ARATI
4. B. L. NIRUPAMA
5. B. V. SANJAY
6. B. V. SHARATH
7. B. L. SUNANDA
8. B. N. RAJESH
9. B. ARCHANA
10. B. N. V. VISHNU PRASAD
11. B. L. ARADHANA

All Minors—by Trustee :
M. UTTAMA REDDI, 9/3, V.O.C. Street, Madras 600 024

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

*1st March* 1977

**Chandamama Camel Colour Contest Result No. 6 (Telugu)**

*1st Prize:* K. Prakasa Rao, Vizinagaram-2. *2nd Prize:* K. Jagadmba, Vishakhapatnam - 530 001. *3rd Prize:* Kandula Kamaraja Gupta, Vizianagaram-2. *4th Prize:* Malepati Umamaheswara Rao, Guntur-4. B. Satyanarayana, Adoni. K. S. Sunanda, Madras-17. D. Sanjat Kumar, Hyderabad-762. D. Hemanth Kumar, Hyderabad-762. *5th Prize :* M. Venkateshwar Rao, Secunderabad-11. P. R. Venkat Sai, Secunderabad-3. K. Padma Sekhar, Vijayawada-6. N. Surya Mani, Visakhapatnam. P. Venkatesh, Secunderabad-3. Arivind Kumar, Secunderabad-3. P. Samuel Swaroop Kumar, Vijayawada-2. K. Srinivasa Rao, Mori. 533 250 B. Sharabjee, Vishakapatnam-1. Balla Babu Nagendra Prasad, Mori Razote Tod.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''తెలివితక్కువ పనులు''] జి. సాంబిరెడ్డి రచన.

ప్రజల జీవితంలో అవినీతీ, పీడనా, అన్యాయమూ ఏర్పడితే, వాటిని తొలగించటానికి తగిన శాసనాలు చెయ్యడం రాజు విధి. అలా శాసనాలు చెయ్యని రాజు సరి అయిన పాలకుడు కాడు. అతడి పరిపాలన అస్తవ్యస్తంగా ఉంటుంది. ప్రజలలో తిరుగుబాటు లాటివి ఏర్పడతాయి. కాని రాజు సరి అయిన శాసనాలు చేసినా కూడా ప్రజాజీవితం బాగుపడక పోతే, ఆ శాసనాలను ధిక్కరించే వారు దేశంలో ఉన్నారన్నమాట. వారే ''రాజు కన్న గొప్పవాళ్ళు.''

సంపుటి 60 మార్చి '77 సంచిక 3

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00




CHITRA




అనుపాయేన కర్మాణి
విపరీతాని యాని చ
క్రియమాణాని దుష్యంతి
హవీంష్యప్రయతేష్వివ. 1

[ఉపాయం లేకుండా చేసే పనులు అపాత్రులకు పెట్టిన అన్నం లాగా దోషం కలిగిస్తాయి.]

యః పశ్చాత్ పూర్వకార్యాణి
కర్మాణ్యభిచికీర్షతి,
పూర్వం చాపరకర్మాణి
న స వేద నయానయౌ. 2

[ముందు చేసే పనులు వెనుకా, వెనుక చేసే పనులు ముందూ చేసే వాడికి మంచి చెడ్డలు తెలీవు.]

చపలస్య తు కృత్యేషు
ప్రసమీక్ష్యాధికం బలం
క్షిప్ర మన్యే ప్రపద్యంతే
క్రౌంచస్య ఖ మివ ద్విజాః. 3

[అధికమైన బలమున్నప్పటికీ చపలుడు పనులు చేసేటప్పుడు ఇతరులు సందు చూసుకుని ఓడిస్తారు.]

పనులు చేసే తీరు



**45**

లేడిని విడిపించుకురావటానికి వెళ్ళిన కాకీ, ఎలుకా ఎంతకూ తిరిగి రాకపోయే సరికి, తాబేలు ఆరాటపడి తానే నింపాదిగా పాకుతూ, తన మిత్రులున్నచోటికి బయలుదేరింది.

తాబేలు రావటం చూసి కాకి కంగారు పడింది. వేటగాడు వస్తే కాకి ఎగిరి పోగలదు, ఎలుక ఏ కలుగులోనో దూరి పోగలదు, లేడి పారిపోగలదు; కాని తాబేలు వాడి నుంచి ఎలా తప్పించు కుంటుంది?

"నువు ఎందుకు వచ్చావు? వెంటనే, వేటగాడు యిక్కడికి తిరిగి రాకముందే, త్వరగా వెనక్కు వెళ్ళిపో," అన్నది కాకి తాబేలుతో.

"నేనేం చెయ్యను? లేడి ఆపదలో ఉండె; మీరిద్దరూ ఎంతకూ రాకపోతిరి. నేను నిలవలేక వచ్చేశాను," అన్నది తాబేలు.

వాళ్ళు ఇలా మాట్లాడుకుంటూండగానే వేటగాడు వస్తూండటం కాకి చూసి, గట్టిగా అరిచింది. ఎలుక చప్పున లేడి బంధాలు కొరికేసింది. లేడి మధ్య మధ్య వెనక్కు తిరిగిచూస్తూ, అతివేగంగా పారి పోయింది. కాకి చెట్టు మీదికి ఎగిరింది. ఎలుక సమీపంలో వున్న ఒక కలుగులో దూరింది.

లేడి తప్పించుకుపోయినందుకు బాధ పడుతున్న వేటగాడు తాబేలును చూసి సంతోషించి, దాన్ని పట్టుకుని, దర్భ గడ్డితో దాన్ని తన విల్లుకు కట్టి, ఇంటికి బయలుదేరాడు.

వేటగాడు తాబేలును పట్టుకుపోతూ ఉండటం చూసి ఎలుక ఎంతో విచారిం

అట్ట చివరి బొమ్మ

చింది. ఒక ఆపద తొలగిందనుకుంటూం డగా ఇంకొకటి వచ్చిపడింది. తనకు ఇలా కష్టాల పరంపర ఎందుకు వస్తున్నదీ దానికి అర్థం కాలేదు. మొదట తన ఆస్తి అంతా పోయింది. తరవాత స్థాన భ్రష్టత్వమూ, మిత్రుల ఎడబాటూ కలి గాయి. జీవితమే అంత! తగిలిన చోటే తగులుతుంది!

ఇంతలో లేడీ, కాకీ తిరిగివచ్చి, జరిగినదానికి అవి కూడా ఎంతగానో దుఃఖించాయి.

ఎలుక వాటితో, "ఏడ్చి లాభం లేదు. మంథరకం కనుచూపుమేర దాటిపోయే లోగా దాన్ని కాపాడే మార్గం చూతాం," అన్నది.

"నాకో ఆలోచన తట్టింది. వేటగాడు తన ఇంటికి వెళ్ళే దారిలో ఒక చెరువు వున్నది. వాడు త్వరలో ఆ ప్రాంతాన్ని చేరుకుంటాడు. ఈలోగా లేడి అడ్డదారిన పరిగెత్తి అక్కడికి వెళ్లి, చచ్చిపోయినట్టు, కదలకుండా చెరువుగట్టు మీద పడుకో వాలి. నేను ఎలుకను నా వీపు మీద ఎక్కించుకుని అక్కడికిపోయి, గట్టుమీద దించి, లేడి తల మీద వాలి, దాని కన్ను పొడుచుకుతింటున్నట్టు నటిస్తాను. ఆ దృశ్యం చూసి వేటగాడు లేడి చచ్చిం దని నమ్మి, తాబేలుతో సహా తన వింటిని గట్టు మీద పెట్టి లేడి కోసం వస్తాడు. అప్పుడు ఎలుక దర్భకట్లు కొరికి, తాబేలును విడిపిస్తుంది. తాబేలు చప్పున



చెరువులోకి వెళ్ళిపోతుంది. వేటగాడు దగ్గిరికి వస్తూండగానే నేను ఎగిరి చెట్టు మీదికి పోతాను. లేడి లేచి దౌడుతీసి పారిపోతుంది,'' అని కాకి అన్నది.

''అద్భుతం! ఈ ఎత్తుకు తిరుగులేదు. తాబేలును మనం కాపాడినట్టే అనుకో వచ్చు. అలాగే చేద్దాం.'' అన్నది లేడి ఉత్సాహంగా.

అది అడ్డదారిన చెరువుగట్టు చేరి, అక్కడ చచ్చినట్టు పడుకున్నది. కాకి ఎలుకను తన వీపుమీద మోసుకుపోయి, చెరువుగట్టున దించి, లేడి తల మీద వాలి, దాన్ని పొడుచుకు తింటున్నట్టు నటించింది.

కొద్దిసేపటికల్లా వేటగాడు అటుగా వచ్చాడు. లేడిని చూసి వాడు, అది అలిసి చచ్చిపడిపోయిందనుకున్నాడు. భద్రంగా కట్టి ఉన్న తాబేలు తప్పించుకు పోలేదు గనక, వాడు దాన్ని కిందపెట్టి, లేడి వేపు వెళ్ళాడు. అప్పుడు ఎలుక గబగబా వచ్చి దర్భకట్లు కొరికి, తాబేలును విడిపించింది.

వెంటనే తాబేలు గట్టుమీది నుంచి చెరువులోకి దూకింది.

వేటగాడు సమీపిస్తూండగా కాకి ఎగిరి పోయి పక్కనున్న చెట్టు మీద వాలింది. లేడి చెంగున లేచి అతివేగంగా అక్కడి నుంచి పారిపోయింది.

వేటగాడు హతాశుడై వెనక్కు వచ్చి, తాబేలు కూడా తప్పించుకు పోయినట్టు తెలుసుకున్నాడు.

''ఓ విధీ, ఈ పెద్ద లేడి నా ఉచ్చులో చిక్కితే దాన్ని తప్పించావు. తాబేలు నా చేతికి అందితే దాన్ని కూడా నువు తప్పించుకునేటట్టు చేశావు. పెళ్ళాం, పిల్లల్ని వదిలి అడవిలో తిరిగే నేను వట్టి చేతులతో వెళ్ళి వాళ్ళ ముఖం ఎలా చూడను?'' అని విలపిస్తూ వేటగాడు ఇంటికి పోయాడు.

వాడు పోగానే మిత్రులు ఒకదాన్నొకటి అప్యాయంగా కౌగలించుకుని, వెంటనే బయలుదేరి తమ స్వస్థానానికి వెళ్ళి, సుఖంగా జీవించాయి.



# 183. రాక్షసి దేవత

కొలంబియాలోని శాన్ అగస్టన్ ప్రాంతపు తవ్వకాలలో ఇలాటి విగ్రహాలు వందల సంఖ్యలో దొరికాయి ఈ దేవతను అర్చించిన వారు ఈనాడు లేరు. ఈ "కోరల" దేవత కుడిచేతిలో సుత్తెలాటి పరికరమూ, ఎడమ చేతిలో శంఖం లాటిదీ, ముఖాన ఆగ్రహమూ కనిపిస్తాయి.






# మాయాసరోవరం

## 15

[మరుగుజ్జు రాణికి శత్రువైన గడెకొండ అనేవాడు నరవానరాన్ని అదుపు చేసేందుకు సాయపడసాగాడు. ఆ సమయంలో జయశీలుడు, నరవానరం వెంట వున్నవాడు తన శత్రువు కృపాణజిత్తు అని గుర్తించాడు. జయశీలుడు బాణంతో నరవానరాన్ని కొట్టగానే, మరుగుజ్జు సేనాని తన భటులతో, శత్రువులున్న కొండగుట్ట మీదికి దాడిబయలుదేరాడు. తరవాత—]

మరుగుజ్జురాణి సైనికులు కొండగుట్ట మీదికి రావటం చూస్తూనే, రాణి శత్రువైన గడెకొండ, గుట్ట వెనుక భాగంలో వున్న తన అనుచరులను పైకి రావలసిందిగా ఆజ్ఞాపించాడు. అతడి మరుగుజ్జు అనుచరులు బల్లాలు చేతబట్టి, కేకలుపెడుతూ కొండగుట్ట మీదికి రాసాగారు. నరవానరాన్ని తాళ్ళతో కట్టి అదుపులోకి తెచ్చుకునేందుకు కృపాణజిత్తూ, మరి కొందరు మరుగుజ్జులూ నానాప్రయాసా పడుతున్నారు.

జయశీలుడు గుట్ట మీదికి వస్తున్న గడెకొండ అనుచరుల కేసి చూసి, సిద్ధసాధకుడితో, "సాధకా, మనం రాణి సైనికులకు సాయపడకపోతే, ఆవిడ శత్రువులు, వాళ్ళను తేలికగా ఓడించగలరు. కృపాణజిత్తును చూశావా? వాడు ఆటవికుడిలా వేషం ధరించాడు. అయినా



నేను వాణ్ణి గుర్తించాను; వాడూ నన్ను గుర్తించి వుండవచ్చు," అన్నాడు.

సిద్ధసాధకుడిక్కూడా తాము స్వయంగా వెళ్ళి, రాణీ సైనికులకు సహాయపడటం అవసరమనిపించింది. అతడు రాణీ కేసి తల తిప్పి, "రాణీ, నువ్వు యిక్కడ వుండటమే క్షేమం. మేము, నీ సైనికుల వెంట పోయి, నీ శత్రువైన గడెకొండడితో పాటు, మా శత్రువైన కృపాణజిత్తును కూడా హతమార్చి వస్తాం," అన్నాడు.

సాధకుడు మాట ముగించేలోపలే నరవానరం భయంకరంగా అరిచింది. ఆ అరుపు వింటూనే జయశీలుడూ, సాధకుడూ కొండగుట్ట కేసి తలలు తిప్పారు. ఇప్పుడు నరవానరాన్ని కృపాణజిత్తు ఒక్కడే నడుముకు బిగించిన గొలుసుతో పట్టుకునివున్నాడు. అది నిటారుగా నిలబడి గుట్ట దిగువకేసి చూసి, భుజాలు చరుచుకుంటూ అరుస్తున్నది.

"సాధకా, నరవానరం మళ్ళీ వాడి అదుపులోకి వచ్చినట్టున్నది. ఈసారి ఆ జంతువు రాయి విసరటం జరిగితే, రాణీ సైనికుల్లో సగంమందికి చావుమూడినట్టే. ఊం, పద!" అంటూ జయశీలుడు గుట్ట కేసి పరిగెత్తాడు. సిద్ధసాధకుడు అతణ్ణి అనుసరించాడు.

ఇద్దరూ వేగంగా గుట్ట మీదికి కొంత దూరం పరిగెత్తి, మరుగుజ్జు సేనానిని చేరి, అతడితో, "సేనానీ, నీ భటుల్ని కొంచెం ఆగమను. వానరం తిరిగి మీ మీదికి రాళ్ళు విసిరే ప్రమాదం వున్నది," అన్నారు.

"అయ్యా, మీరు ఆ భయంకరజంతువు నుంచీ, వెంట వున్న మహాకాయుణ్ణుంచీ మాకు హానికలక్కుండా చూడండి. మేము పోయి అక్కడ గుట్ట మీద నిలబడివున్న గడెకొండ దుర్మార్గుణ్ణీ, వాడి అనుచరులనూ బళ్ళాలకు గుచ్చి, కొండ కిందికి విసిరివేస్తాం," అన్నాడు మరుగుజ్జు సేనాని.

"ఆహాఁ, నీ మాట పలుకు, నీ చేతి బళ్ళెంమొన అంత వాడిగానే వున్నది. కాని, నువ్వు తలచినదంతా తలచినట్టు

చేయటానికి దేవతవో, రాక్షసుడివో కాదు; మరుగుజ్జు మనిషివి! తెలిసిందా?'' అన్నాడు సిద్ధసాధకుడు కోపంగా.

జయశీలుడు శాంతించమన్నట్టుగా సాధకుడి కేసి చేయి వూపాడు. అంతలో నరవానరం ఒక బండరాయిని ఎత్తి పట్టుకున్నది. అదిచూసి సిద్ధసాధకుడు విసుక్కుంటూ, ''ఛీ, ఛీ! ఈ వానరానికి రాళ్లు విసరటం తప్ప, మరే విద్యా చాతనైనట్టులేదు. నా శూలంతో ఒక్కపోటుపొడిచి, పీడ విరగడ చేస్తాను,'' అంటూ శూలం పైకెత్తి, వేగంగా వానరం కేసి బయలుదేరాడు.

సాధకుడు దుస్సాహసం చేయబోయి, ప్రాణం మీదికి తెచ్చుకుంటాడని గ్రహించిన జయశీలుడు, సాధకుణ్ణి ఆగమని, బాణం ఎక్కుపెట్టి వానరం కేసి వదిలాడు. బాణం గురి తప్పి, కృపాణజిత్తు చేతిలో వున్న ఇనుపగొలుసుకు తగిలింది. ఆ తాకిడికి గొలుసు అతడి చేతినుంచి జారి కింద పడింది. వెంటనే వానరం రాయిని కింద పడవేసి పారిపోబోయింది. కాని, కృపాణజిత్తు చప్పున గొలుసు పట్టుకుని, నరవానరాన్ని వెనక్కు గుంజాడు. ఆ క్షణంలోనే అతడు తన మీదికి బాణం వదిలినవాడు, తన శత్రువైన జయశీలు డని గుర్తించాడు.

కృపాణజిత్తు భయాశ్చర్యాలతో వణికిపోయాడు. ఆ నిమిషం వరకూ అతడికి, ఆ వచ్చినవాళ్ళు ఎవరో మామూలు





మనుషులని తప్ప, జయశీలుడని తెలియదు. సిద్ధసాధకుణ్ణి అతడేనాడూ చూసి వుండలేదు.

"గడెకొండా! ఇది శత్రువులను హతమార్చటానికి తగిన సమయం కాదు. ఆ విల్లంబులు పట్టినవాడు దూరం నుంచే మన ప్రాణాలు తీయగలడు. నరవానరం జంతువు గనక, బాణం తగిలినా నిలబడగలిగింది. మనమైతే ఆ దెబ్బకు నేల కొరిగేవాళ్ళం," అన్నాడు కృపాణజిత్తు, నరవానరాన్ని కొండగుట్ట వెనక్కు మళ్లించే ప్రయత్నం చేస్తూ.

గడెకొండ, జయశీల, సిద్ధసాధకుల కేసి ఓమారు చూసి, కృపాణజిత్తుతో, "అయ్యా మహాకాయా! మీ ఆజ్ఞను కాదనను. కాని, మీరు నరవానరంతో ఒక్క ఊపున పోయి పడి, ఆ విల్లంబులు పట్టినవాణ్ణి చంపలేరా? మేము ఆ సమయంలో దుష్టరాణి సైనికులందరినీ, మా బల్లాలతో నిలువునా చీల్చి చెండాడగలం," అన్నాడు.

ఆ మాటలకు కృపాణజిత్తు కళ్లెర్రచేసి, నరవానరాన్ని గుట్ట దిగువకు లాక్కుపోతూ, "గడెకొండా, నే నేమైనా, నీ తలలో వున్న ఈకలజాతి పక్షినైన రాబందు ననుకున్నావా, అలా గాలిలో ఎగిరిపోయి వాళ్ళ మీద పడటానికి? వాళ్ళను చంపే ఉపాయం వేరే వున్నది. ముందు అందరూ ప్రాణాలతో గూడేనికి పారిపోయి రండి, తెలిసిందా?" అన్నాడు.

గడెకొండ తన అనుచరులకు కొండ గుట్ట దిగి గూడేనికి పరిగెత్తమని ఆజ్ఞయిచ్చాడు. ఆ వెంటనే అతడి పొట్టేళ్ళ రౌతులూ, బల్లాలు పట్టుకున్నవాళ్ళూ వెనుదిరిగి, గుట్ట దిగువ కేసి బయలుదేరారు. శత్రువులు పారిపోతున్నారని చూస్తూనే జయశీలుడు, మరుగుజ్జు సేనానితో, "సేనానీ, యిదే నీకు మంచి అవకాశం. అందిన శత్రువుల మీద బల్లాలు ప్రయోగించు, అందనివాళ్ళ మీద గుట్ట మీది నుంచి రాళ్ళు దొర్లించి, ఎంత

మందిని పరలోకానికి పంపగలవో చూడు," అని హెచ్చరించాడు.

శత్రువులు వెన్నిచ్చి పారిపోతూండటం మరుగుజ్జు సేనానికి మరింత ధైర్యాన్ని కలిగించింది. అతడు తన భటులను పెద్దగా హెచ్చరించి, "ఒరే, వీర శూర గడెకారిభటులారా! బెబ్బులుల్లా, కొదమ సింగాల్లా ముందుకురికి, గడెకొండముఠా వాళ్ళను బల్లాలతో పొడవండి. భయంకర జంతువు పారిపోతున్నది. దాని భయం మనకికలేదు," అన్నాడు.

తమ నాయకుడి మాటలతో మరుగుజ్జు భటులందరూ ఉత్సాహం పొంది, పెద్దగా కేకలు పెడుతూ గుట్ట మీదికి పోయారు. అక్కడ వాళ్ళకు పారిపోతున్న గడెకొండ పొట్టేలు రౌతులూ, బళ్ళెం భటులూ కొందరు చిక్కారు. భటులు వాళ్ళను బళ్ళాలతో పొడిచి, ఏటవాలుగా వున్న గుట్ట కిందికి దొర్లించసాగారు.

మరుగుజ్జు సేనాని బల్లెం ఎత్తి పట్టుకుని, తన పొట్టేలు వాహనాన్ని, గుట్టమీద అటూ యిటూ పరిగెత్తిస్తూ, వాళ్ళను ఉత్సాహపరుస్తున్నాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ ఆ సమయంలో అక్కడికి వెళ్ళారు. వాళ్ళకు కొండగుట్ట దిగి పారిపోతున్న గడెకొండ అనుచరులతో పాటు, నరవానరాన్ని



ముందుండి లాక్కుపోతున్న కృపాణజిత్తు కూడా కనిపించాడు.

సిద్ధసాధకుడు శూలం ఎత్తి పట్టుకుని, "జై, మహాకాళా!" అంటూ కొండలూ, గుట్టలూ దద్దరిల్లేలా కేకపెట్టి, "జయశీలా, అలా చూస్తావేం? పద. ఆ గడెకొండ మరుగుజ్జు నివసించే గూడెం, గుట్ట కింద చెట్లచాటున కనిపించేదే. పోయి హఠాత్తుగా మీదపడి, కృపాణజిత్తునూ, వాడి అడే కోతినీ, గడెకొండగాడి మరుగుజ్జుల్ని చీల్చి చెండాడదాం," అన్నాడు.

సిద్ధసాధకుడి మాటలకు జయశీలుడు చిన్నగా నవ్వి, "సాధకా, శత్రుబలాన్ని చులకన చేయటం ప్రమాద కారణం



వెయ్యి కోసుల ప్రాంతానికి చక్రవర్తి కాగలడే! మనం యిదంతా చూస్తూ ఎలా వూరుకోవటం?'' అన్నాడు సిద్ధసాధకుడు.

జయశీలుడు ఏదో జవాబివ్వబోయేంతలో మరుగుజ్జుసేనాని అతడి ముందుకు వచ్చి, ''అయ్యా, మీ సెలవై, మీ సహాయం కూడా వుంటే—ఇప్పుడే గుట్ట దిగిపోయి, గడెకొండ గూడెం మీదపడి శత్రువుల్ని దుంపనాశనం చేస్తాం. ఏమిటి మీ ఆజ్ఞ?'' అన్నాడు.

జయశీలుడు చుట్టూ ఓమారు కలయ చూసి, ''సేనానీ, నీ ధైర్యసాహసాలు మెచ్చదగినవి. ఇక్కడ అందినంతమంది శత్రువులను చంపావు. మిగిలినవాళ్ళూ, నరవానరం వాళ్ళ గూడెం చేరుతున్నారు. ఇప్పుడు వాళ్లు తగుహెచ్చరికలో వుంటారు. మనం దాడిచేయటం అనవసర రక్తపాతానికి తప్ప, మన విజయానికి సహాయపడకపోవచ్చు,'' అన్నాడు.

''అయితే యిప్పుడు మమ్మల్ని ఏం చేయమని తమ ఆజ్ఞ?'' అని అడిగాడు మరుగుజ్జుసేనాని.

''అందరూ గుట్ట దిగి మీ రాణీ దగ్గరకు వెళ్ళండి. తరవాత మీ గూడేనికి తగిన రక్షణ ఏర్పాటుచేసుకోండి. మన ఆలోచనలాంటిదే శత్రువులకు కూడా కలిగివుండ

అవుతుంది. వాళ్ళను యిక్కడ గుట్టమీద హడలకొట్టి పారిపోయేలా చేయటం వేరు; సూటిగాపోయి వాళ్ళ ఇళ్ళ మీద పడి చంపాలని ప్రయత్నించటం వేరు. పైగా మనకు యీ గడెకొండ అనుచరులైన మరుగుజ్జులను చంపవలసిన అవసరం కూడా లేదు. వాళ్ళకూ, మరుగుజ్జురాణికీ ఏదైనా రాజీ కుదిర్చే ప్రయత్నం చేద్దాం. అదే ఆలోచిస్తున్నాను. నువు తొందర పడకు,'' అన్నాడు.

''మరి మన శత్రువైన కృపాణజిత్తు మాటేమిటి? వాడు మచ్చికచేసిన నరవానరం సంగతేమిటి? దాని సాయంతో ఆ దుర్మార్గుడు, యీ చుట్టుపక్కల

వచ్చు. వాళ్ళు హఠాత్తుగా మీద పడకుండా తగు జాగ్రత్తలో వుండండి. మేం ఇద్దరం త్వరలో నే మీ గూడేనికి వస్తాం,'' అన్నాడు జయశీలుడు.

మరుగుజ్జు సేనాని తన భటుల్లో ఒకణ్ణి, జయశీల, సిద్ధసాధకులకు దారి చూపేం దుకు అక్కడ వదిలి, తతిమ్మావాళ్ళతో విజయధ్వానాలు చేస్తూ, కొండగుట్ట కింద మరుగుజ్జురాణీ వున్న చోటుకు బయలు దేరాడు.

జయశీలుడు కదలా మెదలక గడె కొండ గూడెం కేసే చూస్తూ నిలబడ్డాడు. సిద్ధసాధకుడు అతడి కేసి కొంచెం సేపు చూసి, ''జయశీలా! ఏమిటంత దీర్ఘంగా యోచిస్తున్నావు? మనం అనవసరంగా యీ మరుగుజ్జు వెధవల మధ్య వచ్చి పడటం, మనదే తప్పు. మనం బయలు దేరిన పనేమిటి?'' అన్నాడు.

''మనం కావాలని యిక్కడికి వచ్చి పడలేదు, సాధకా! అందుకు కారణం ఆ మొసలి ఆకారం దుష్టుడు మకరకేతు! మనం జలపాతంలో చిక్కుకుని, కొండ మీది నుంచి ప్రాణాలతో యిక్కడికి చేరాం. అపహరించబడ్డ హిరణ్యపురం రాజు కనకాక్షుడి పిల్లల్ని తిరిగి తెచ్చేం దుకు బయలుదేరిన మనం, ఇలా అరణ్యా వాసుల తగవుల మధ్య చిక్కుకు పోవటం ఆశ్చర్యం కలిగిస్తున్నది. ఏమైనా, మనం యీ ప్రాంతం నుంచి బయలుదేరి పోయే లోపల, ఆ కృపాణజిత్తును మాత్రం



పరలోకానికి పంపి తీరాలి,'' అన్నాడు జయశీలుడు.

''మహాకాలుడి దయవల్ల ఆ పనితో పాటు, వాడి వెంటవున్న క్రూరమృగాన్ని కూడా చంపి, చర్మం వలిపించాలి. ఇక పద, శోషవచ్చేటంత ఆకలిగా వుంది. మరుగుజ్జు రాణి గూడేనికి చేరదాం,'' అంటూ సిద్ధసాధకుడు వెనుదిరిగి బయలుదేరాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ యిలా కొండగుట్ట మీద మాట్లాడుకుంటూ వుండగా, దిగువునవున్న చెట్లచాటున నిలబడి మరుగుజ్జు గడెకొండా, కృపాణ జిత్తూ తమకు కలిగిన ఓటమికి నువ్వే కారణం అంటూ, ఒకరి నొకరు నిందించుకోసాగారు.

''అయ్యా మహాకాయా! మీది భారీ శరీరమే కాని, దానికి సరితూగే భారీ గుండె బలం మాత్రం మీలో లేదు. మాకన్న మీరే ముందుగా పారిపోయే ప్రయత్నం చేశారు. మీరు మచ్చికచేశామని చెప్పే, యీ నరవానరం మిమ్మల్నే చంపే ప్రయత్నం చేసింది,'' అన్నాడు గడెకొండ.

ఆ మాటలకు కృపాణజిత్తు గట్టిగా పళ్ళు కొరికి, ''ఒరే, గుడ్డికొండా! నేను శత్రువుల నుంచి పారిపోలేదు; సమయం కాదని తిరోగమించాను—అంతే! నా కేసి బాణం కొట్టిన జయశీలు డనే పరమ శత్రువును, రేపు సూర్యోదయం లోపల చంపకపోతే, నా పేరు కృపాణజిత్తు కాదు, నక్కజిత్తు! ఇక నా నరవానరం సంగతా? అది కోతిపిల్లలా నే చెప్పినట్టు విని తీరుతుంది. అందుకు రుజువు...'' అంటూ నరవానరానికి, గడెకొండను చూపి, చేతులు ఊపాడు.

నరవానరం మెరుపులాపోయి గడెకొండను ఎత్తి పట్టుకుని, భయంకరంగా అరవసాగింది. తమ యజమాని ప్రాణాపాయస్థితిలో వున్నాడని చూస్తూనే, గడెకొండ అనుచరులు బళ్ళాలు ఎత్తి, కేకలు వేస్తూ నరవానరం, కృపాణజిత్తుల మీదికి రాసాగారు. —(ఇంకావుంది)





# తెలివితక్కువ పనులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఈ శ్రమను కోరి తెచ్చుకున్నావో, లేదో గాని, కొందరు ఆపదలను కోరి తెచ్చుకుంటారు, చేతికి అందుబాటులోకి వచ్చిన లాభాన్ని కాల దన్నుకుంటారు. ఇలాటి తెలివి తక్కువ పనులు చేసే వారికి తార్కాణం చంద్రహాసుడు. అతని కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం రవివర్మా, శశివర్మా అని ఇద్దరు రాజులు ఇరుగు పొరుగు రాజ్యాలను పాలించేవారు. ఆ రెండు రాజ్యాల మధ్య అనాదిగా వైరం ఉంటూనే ఉన్నది. అప్పుడప్పుడూ యుద్ధాలు జరిగేవి.

## బేతాళ కథలు



19



కాని .రెండింటినీ ఏలే శక్తి ఏ రాజుకూ లేకపోయింది.

రవివర్మ తన కూతురికి స్వయంవరం ప్రకటిస్తూ, శశివర్మ కుమారుడు చంద్ర హాసుణ్ణి ఆహ్వానించటానికి ప్రత్యేకంగా ఒక మనిషిని పంపాడు. ఆ మనిషి శశివర్మతో, తమ ప్రభువైన రవివర్మ శశివర్మతో బాంధవ్యం కోరుతున్నాడనీ, ఉభయదేశాల మధ్యా ఉంటూ వస్తున్న శత్రుత్వం తొలగిపోవాలని ఆయన కోరిక అనీ చెప్పాడు.

ఈ మాటవిని శశివర్మ సంతోషించాడు. ఎందు చేతనంటే, తనకు ఒక్కడే కొడుకు; రవివర్మకు ఒక్కతే కూతురు. ఈ వివాహం జరిగితే చంద్రహాసుడు రెండు దేశాలనూ ఏకం చేసి, పాలిస్తాడు. ఆ విధంగా తన తాతముత్తాతల ఆశయం సిద్ధిస్తుంది.

అందుచేత ఆయన చంద్రహాసుడికి ఈ ఆహ్వానం గురించి చెప్పి, స్వయం వరానికి వెళ్ళమని ప్రోత్సహించాడు. చంద్రహాసుడికి వెళ్ళటం ఇష్టం లేదు. అయినా తండ్రిమాట తీసెయ్యలేక, తన మిత్రుడు సుబుద్ధిని వెంట బెట్టుకుని అతను రవివర్మ రాజ్యానికి బయలు దేరాడు.

వాళ్ళిద్దరూ అరణ్యం కుండా తమ గుర్రాల మీద పోతూ, మధ్య దారిలో ఒక ఆటవికుల తండాకు చిక్కారు. ఆ ఆట వికులు వారిని బంధించి తమ నాయకుడి వద్దకు తీసుకుపోయారు.

సుబుద్ధి ఆటవిక నాయకుడితో తాము ఎవరో, ఏంపనిమీద పోతున్నారో చెప్పాడు.

"మీరు ఎవరైతే మాకేం? మా పొలి మేరలోకి వచ్చిన విజాతీయులను మేం మా దేవతకు బలి ఇస్తాం. కాదంటే మీ ఇద్దరిలో ఎవరో ఒకరు మా శూరుడితో పోరాడి గెలిస్తే, మీరు మీదారినపోవచ్చు," అన్నాడు ఆటవికనాయకుడు.

"మీ వీరుడితో నేను పోరాడుతాను," అన్నాడు చంద్రహాసుడు.

"వీళ్ళకట్లు విప్పి, వీళ్ళను స్వేచ్ఛగా వదలండి. రేపు ఉదయం పోరాటం ఏర్పాటు చేస్తాను," అన్నాడు ఆటవిక నాయకుడు.

ఆయన చంద్రహాసుణ్ణీ, సుబుద్ధినీ విడిపించటమే గాక, ఆ రాత్రి వాళ్ళ భోజనానికీ, పడకకూ అవసరమైన ఏర్పాట్లన్నీ చేయించాడు.

ఆ రాత్రి సుబుద్ధి చంద్రహాసుడితో, "మనం పారిపోదాం. మనకు ఎవరూ కాపలాలేరు. రేపు నువు ఈ అడవి మనుషులతో పోరాడటం దేనికి? వీళ్ళు చాలా బలంగానూ, మొరటుగానూ ఉంటారు. నువ్వు గెలుస్తావని ఏమిటి?" అన్నాడు.

"అలా పిరికిగా పారిపోయేకన్న వీరుడైన వాడిచేతిలో చావటం మేలుకాదా? మనని నమ్మిగదా వీళ్ళు మనని స్వేచ్ఛగా వదిలేశారు? వాళ్ళను మోసగించటం కన్న నీచం ఉంటుందా? మనకేమీ భయం లేదు," అన్నాడు చంద్రహాసుడు.

మర్నాడు చంద్రహాసుడికీ ఒక ఆటవిక వీరుడికీ పోరాటం జరిగింది. అందులో చంద్రహాసుడు గెలిచాడు. ఆటవికుల నాయకుడు చంద్రహాసుడికీ, సుబుద్ధికీ కానుకలిచ్చి సన్మానించి, పంపేశాడు.

తన ఆహ్వానం అందుకుని స్వయంవరానికి వచ్చిన చంద్రహాసుడికి విడిదీ, ఇతర సదుపాయాలూ ఏర్పాటు చేయించాడు రవివర్మ.





స్వయంవరం సందర్భంగా అందులో పాల్గొనటానికి వచ్చిన వారిమధ్య చాలా పోటీలు ఏర్పాటు చేశారు. చంద్రహాసుడు అన్ని పోటీలలోనూ గెలిచి, అందరినీ ఓడించాడు.

రవివర్మ చంద్రహాసుడితో, ''రేపు ఉదయం నీకు కమలనాభు డనే అతనితో పోటీ జరుగుతుంది. అతను ఇంతవరకూ పోటీలలో పాల్గొనలేదు. మీ ఇద్దరిలో ఎవరు గెలిస్తే వారికి నా కుమార్తెను ఇచ్చి పెళ్ళి చేస్తాను,'' అన్నాడు.

ఈ మాట విని సుబుద్ధికి ఆగ్రహం వచ్చింది. అతను బసలో చంద్రహాసుడితో, ''ఈ రాజు ఉద్దేశం ఏమిటి? పోటీలో పాల్గొన్న అందరినీ నువు ఓడించావు. నీకు ఈయన తన కూతురు నిచ్చి చెయ్యక, మళ్ళీ ఇంకెవడితోనో కొత్తగా పోటీ అంటా డేమిటి? నేను వెళ్ళి అడిగి రానా?'' అన్నాడు.

''ఆ రాజు దగ్గరకు పోయి నువ్వేమీ అడగవలసిన అవసరం లేదు. నాకు పరిస్థితి అంతా అర్థమయింది,'' అన్నాడు చంద్రహాసుడు.

అతను అర్ధరాత్రివేళ సుబుద్ధిని నిద్ర లేపి, ''మనం బయలుదేరుదాం పద! తెల్లవారే లోపుగా ఈ రాజ్యం పొలిమేర దాటిపోవాలి,'' అన్నాడు.

సుబుద్ధికి ఈమాట వినగానే నిద్రమత్తు వదిలింది. అతను చంద్రహాసుణ్ణి ఎగా దిగా చూసి, ''అదేమిటి? రేపు ఆ పోటీ కూడా గెలిచి రాజకుమార్తెను పెళ్ళాడవా? అందుబాటులోకి వచ్చిన వివాహాన్ని వదులుకుంటావా?'' అన్నాడు.

చంద్రహాసుడు సుబుద్ధిమాట విని పించుకోక, అతన్ని వెంటనే బయలుదేర దీశాడు. ఇద్దరూ తమ గుర్రాల మీద వెంటనే బయలుదేరి, మర్నాడు అపరాహ్ణా నికి సురక్షితంగా తమ నగరం చేరు కున్నారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, చంద్రహాసుడు బుద్ధిహీనుడా, దుస్సా

హసం గలవాడా, పిరికివాడా? అతను ఆటవికుల నుంచి పారిపోక, పోరాటానికి ఎందుకు ఒప్పుకున్నాడు? ఆ పోరాటంలో అతను ఓడితే ఏమయేది? స్వయంవరంలో అన్ని పోటీలలోనూ గెలిచి, ఇంకొక్క పోటీ మాత్రమే ఉందనగా ఎందుకు చీకటి మాటున పారిపోయాడు? ఈ అనుమానాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "చంద్రహాసుడు తెలివీ, ధైర్యమూ, ఔదార్యమూ, ఆత్మవిశ్వాసమూ గలవాడు. నువు చెప్పిన అవలక్షణాలు అతనిలో మచ్చుకైనాలేవు. అతను ఆటవికుల నిజాయితీని మెచ్చుకుని, వారిలాగే తాను కూడా మాటకు కట్టుపడి పోయాడు. కాని రవివర్మ విశ్వాసఘాతకుడన్నది ముందే తెలిసిపోయింది. తన కుమార్తె పెళ్ళికి పోటీలు ఏర్పాటు చేయదలచినవాడు ప్రత్యేకంగా మనిషిని పంపి చంద్రహాసుణ్ణి ఆహ్వానించటంలో కుట్ర ఉండి ఉండాలి. చంద్రహాసుడి తండ్రి ఆలోచించినట్టే రవివర్మ కూడా ఆలోచించి, ఎలాగయినా చంద్రహాసుణ్ణి హతమార్చితే తనకు శశివర్మ రాజ్యం దొరుకుతుందనీ, ఆ విధంగా తన తండ్రి తాతలు చేయలేకపోయిన పని తాను చేసినవాడవుతాడనీ అంచనా వేసి ఉండాలి. ఈ సంగతి చంద్రహాసుడు అర్థం చేసుకున్నాడు, సుబుద్ధి అర్థం చేసుకోలేదు. అయినా పిరికివాడనిపించుకోవటం ఇష్టంలేక చంద్రహాసుడు అన్ని పోటీలలోనూ పాల్గొని, గెలిచాడు. ఇంకో పోటీ అదనంగా రవివర్మ సృష్టించినది, చంద్రహాసుణ్ణి మోసంతో హతమార్చటానికే అయిఉండాలి. ఆ అవకాశాన్ని రవివర్మకు ఇయ్యటం ఇష్టంలేక చంద్రహాసుడు అర్ధరాత్రివేళ బయలుదేరి వెళ్ళిపోయాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






ఒక ఊళ్ళో రాజన్న అనే దొంగ ఉండేవాడు. అతని పేరు చెబితే ఆ ప్రాంతాల అందరికీ హడలు. అతను తలుచుకుంటే నిర్దాక్షిణ్యంగా ప్రాణాలు తీయగలడు. అతను తమ జోలికిరాకుండా ఉండగలందులకు గొప్ప గొప్ప ధనవంతులు అతనికి పెద్ద మొత్తాలలో ధనం ఇచ్చేవాళ్ళు.

రాజన్న ఈ విధంగా అంతులేని బంగారం కూడబెట్టాడు. అతనికి భీమన్న అనే కొడుకు ఉన్నాడు. భీమన్న తండ్రిని మించిన గుండెబలం గలవాడు. తన కొడుక్కు పదహారేళ్ళు నిండగానే రాజన్న అతడికి చోరవిద్యలు బోధించాడు. తన కొడుకు తనను మించిన గజదొంగ అవుతాడని రాజన్న గర్వపడేవాడు.

ఒక రోజు రాజన్న దొంగతనానికి బయలుదేరుతూ భీమన్నను తన వెంట రమ్మన్నాడు. అయితే భీమన్నకు తన తండ్రి వృత్తి అసహ్యం అనిపించింది. అతను తండ్రితో ఆ మాటే అంటూ, "నీలా దొంగతనాలు చేస్తూ, చీకటి బతుకు బతకటం నాకు ఇష్టం లేదు. అయినా, కావలిసినంత సంపాదించావు. ఇంకా దేనికి? ఈ వృత్తికి స్వస్తి చెప్పెయ్యి," అన్నాడు.

ఈ మాట విని రాజన్న అదిరిపడి, "ఛీ! వట్టి చవటదద్దమ్మ లాగున్నావు. నేను దొంగతనాలు చేస్తున్నది తిండికి లేక కాదు. ఇది మన తాతలనాటి నుంచీ వస్తున్న వృత్తి. చాలామంది మెచ్చని వృత్తులు ఎన్నో ఉన్నాయి, వాటిలో ఇది ఒకటి. ఒకప్పుడు మా తాతపేరు చెప్పితే ఇనప్పెట్టెలు గజగజలాడేవి. నువూ అంత వాడివవుతావనుకున్నాను. నా కడుపున పుట్టి ఇలా పిరికి మాటలు మాట్లాడటం నేను

బూర్లె నాగేశ్వరరావు

సహించను. జానెడు పొట్టనిండటానికి బారెడు కష్టం చెయ్యాలి. అది చేతగాని వాళ్ళు చేసేపని. తరతరాలుగా మనం లోకం దృష్టిలో దొంగలం. ఇప్పుడు అకస్మాత్తుగా మంచివాళ్ళం అయిపోయామంటే మనని చూసి అందరూ నవ్వుతారు,'' అన్నాడు.

దానికి భీమన్న, ''నీ వంశమంతా శాశ్వతంగా దొంగ వృత్తిలోనే నిలిచిపోవాలనుకుంటే అంతకన్న తెలివితక్కువ ఉండదు. ఈ వృత్తి ఎల్లప్పుడూ ఇలాగే ఉండదు; దెబ్బతింటుంది. రోజులు మారిపోతున్నాయి,'' అన్నాడు.

''అయితే, ఈ నాటినుంచీ నీ బతుకు నువు బతుకు. ఎప్పటికైనా నువు నా దారికి రాకతప్పదు,'' అన్నాడు రాజన్న కొడుకుతో.

భీమన్నకు తండ్రిని మార్చే మార్గం తట్టలేదు. అతను ఇల్లు వదిలిపెట్టి, స్వశక్తితో బతక యత్నించాడు. భీమన్న ఈడు యువకులు ఎన్నో రకాల పనులలో ప్రవేశిస్తున్నారు. కాని దొంగకు కొడుకు కావటం చేత భీమన్నను ఎవరూ దగ్గిర చేరనియ్యలేదు. పాలు అమ్మేవాళ్ళూ, పళ్లు అమ్మే వాళ్లు కూడా అతన్ని చాలా హీనంగా చూశారు.

నిరాశతో నీరసంగా ఇంటికి తిరిగి వచ్చిన కొడుకును చూసి రాజన్న, ''ఏం, బాబూ? నీతిగా బతికే మార్గం ఏదైనా దొరికిందా?'' అని అడిగాడు.





"నువు దొంగవని తెలిసినవాళ్లు నన్ను ఎందుకు చేరనిస్తారు? నీ కొడుకునని చెప్పుకోవటానికి సిగ్గుగా ఉంది. నిన్నూ, నన్నూ ఎరగని చోటికి వెళ్ళాలనుకుంటు న్నాను,'' అన్నాడు భీమన్న.

"అలాగే వెళ్ళు! నాలుగురోజులు పస్తులుంటే నువే తిరిగి వస్తావు,'' అన్నాడు రాజన్న.

"తిరిగి వస్తాను—కాని పస్తులుండి కాదు. పుట్టిన ప్రతివాడూ దొంగతనాలూ, దోపిడీలూ చెయ్యనిదే బతకలేడన్న నీ అభిప్రాయం మార్చుకున్న రోజున! తన పొట్ట కోసం ఎదటివాళ్ళ పొట్టలు కొట్టటం మనిషి అయినవాడు చెయ్యవలసిన పనికాదని నువు గ్రహించిన రోజున తిరిగి వస్తాను,'' అని భీమన్న ఊరు వదిలి వెళ్ళిపోయాడు.

భీమన్న వెళ్ళిపోయాక రాజన్న కుంగిపోయాడు. అతనికి తిండి కూడా సయించలేదు. అతను దొంగతనాలకు పోవటం కూడా మానుకున్నాడు. రాజన్నలో ఏదో మార్పు అందరికీ కనిపించింది. క్రమంగా ప్రజలలో దొంగలభయం తగ్గిపోసాగింది.

కాని అంతలో ఒక వర్తకుడి ఇంట లక్షలు విలువచేసే నగలు చోరీ అయాయి. ఆ సంగతి విని రాజన్న నిర్ఘాంతపోయాడు. అది అతను చేసిన దొంగతనం కాదు. కాని లోకం అతన్నే శంకిస్తుంది. రాజన్న వర్తకుడి ఇంటికి వెళ్ళి, ఆ దొంగతనం తాను చేసినది కాదని చెప్పుకున్నాడు.

అయితే రాజన్న మాటలు ఎవరూ నమ్మినట్టు కనబడలేదు. చాలా ఏళ్ళుగా ఆ ప్రాంతాల తనకు తెలియకుండా ఏ దొంగతనమూ జరగలేదు గనక, తాను నిర్దోషి అని ప్రజలు నమ్మాలంటే తాను ఈ కొత్త దొంగను పట్టుకోవటం తప్ప వేరే మార్గం లేదనుకున్నాడు రాజన్న.

దొంగతనాలు సాగుతూనే ఉన్నాయి. దొంగను పట్టటానికి రాజన్న రాత్రివేళల కారాడుతూనే ఉన్నాడు. కాని ఫలితం కనిపించలేదు. దొంగను పట్టుకుంటానని

రాజన్న ప్రజల ముందు ప్రతిజ్ఞ చేసి, దాన్ని నిలబెట్టుకోలేకుండా ఉన్నాడు.

ఇంతలో రాజన్న ఇంటనే దొంగతనం జరిగింది. దొంగను పట్టటానికి రాజన్న బయట తిరుగుతున్న సమయంలో దొంగ అతని ఇంట ప్రవేశించి, పూర్తిగా ఇల్లు దోచుకుపోయాడు. ఈ సంగతి తెలిసి రాజన్న ఇంటికి పరిగెత్తి పోయి, తన భార్య చేతులూ, కాళ్ళూ కట్టిపడేసి ఉండటం చూశాడు. రాజన్న దొంగతనాలు చేసి ఎన్నో ఏళ్ళుగా కూడబెట్టినదంతా పోయింది. ఒక్క దెబ్బన రాజన్న బికారి అయిపోయాడు.

ఈ సంగతి తెలియగానే ఊళ్ళో అందరూ రాజన్నను గురించి ఆశోహ పడటం మానుకున్నారు. ధనికులు అతని మీద సానుభూతి కూడా చూపారు. అది నిజమైన సానుభూతి కాదనీ, సంతోషమనీ రాజన్నకు తెలుసు.

అంతా పోగొట్టుకున్న రాజన్న తిరిగి తన వృత్తి కొనసాగించ దలచి, తన మామూళ్ళు ఎప్పటిలాగే ఇయ్యమని అడిగాడు.

"పిచ్చి పిచ్చి వేషాలు వేశావంటే తాట ఒలిచేస్తాం. వెళ్లు!" అన్నారు వాళ్లు.

ఒకప్పుడు తనతో ఎవరన్నా అలా మాట్లాడితే వాళ్ళ రక్తం చూసేవాడు రాజన్న. అలాటివాడు ఇప్పుడు ఆ మాటలకు బెదిరిపోయాడు. ఈ మార్పుకు కారణం రాజన్న తెలుసుకోలేకపోయాడు.



ఆ రాత్రే అతను తన వస్తువులన్నీ సర్దుకుని, తన భార్యతో సహా ఊరు వదిలి, ఇంకెక్కడైనా బతకవచ్చునని బయలు దేరాడు. కొంతదూరం వెళ్లగానే రాజన్నకు కొడుకు ఎదురయాడు. రాజన్న కొడుకును కౌగలించుకుని, జరిగినదంతా చెప్పాడు.

భీమన్న చిరునవ్వు నవ్వి, "బాధ పడకు. ఊరి వాళ్ళు నిన్ను ప్రాణాలతో వదిలినందుకు సంతోషించు. నా యింటికి పద, హాయిగా బతుకుదాం," అన్నాడు.

"నేనంటే గజగజలాడే ధనవంతులు నన్ను కుక్క కన్న హీనంగా చూశా రెందుకో నాకు అర్థం కావటంలేదు. నాలో ఏ బలహీనత కనబడింది వాళ్ళకు?" అని రాజన్న కొడుకును అడిగాడు.

"నీకు నీ వృత్తిపట్ల గౌరవమూ, విశ్వాసమూ ఉన్నంత కాలమూ ధనికులు నిన్ను చూసి గజగజలాడారు. నువు దొంగతనాలు చెయ్యటం లేదని జనాన్ని నమ్మించటానికి నానా అగచాట్లూ పడి వారి దృష్టిలో లోకువ అయావు. నువు ఇప్పుడు కోరలు పీకిన పాముపు. ఎందు కంటే, నిన్ను మించిన దొంగ ఒకడు పుట్టుకొచ్చి, నిన్నే దోచుకున్నాడు. ధనికులు ముడుపులు చెల్లిస్తే వాడికి చెల్లిస్తారుగాని, నీలో ఏం చూసి నీకు చెల్లిస్తారు? అసలు ఈ వృత్తి లక్షణమే ఇంత. ఎప్పుడో ఒకప్పుడు కథ అడ్డం తిరుగుతుంది. సంఘానికి బరువైన వాడు పతనంకాక తప్పదు," అన్నాడు భీమన్న.

"మొదట నువు ఈ మాట చెప్పి నప్పుడు నా తల కెక్కలేదు. ఈ కొత్త దొంగ నా పొట్ట కొట్టటమేగాక, నా కళ్లు కూడా తెరిచాడు. ఇక నేను దొంగతనా లకు పోను, కష్టం చేసుకు బతుకు తాను," అన్నాడు రాజన్న.

"వాడు నిజమైన దొంగ కాదు. నిన్ను మార్చటానికేవచ్చాడు," అన్నాడు భీమన్న.

"అలాగా? ఎవరు వాడు?" అని రాజన్న అడిగాడు.

"నేనే!" అన్నాడు భీమన్న పొట్ట చెక్కలయేలా నవ్వుతూ.






విశాలదేశాన్ని ఏలే ఉదారసేనుడు తన ప్రజలకు మేలు చేసే ఉద్దేశంతో ఎన్నో మంచి శాసనాలు చేశాడు. కాని వాటి ద్వారా సామాన్యప్రజల జీవితాలు బాగు పడలేదు. దేశంలో పేదరికం ఇంకా తాండవిస్తూనే ఉన్నది. లోపం ఎక్కడ ఉన్నదీ ఆయనకు అంతుబట్టలేదు. ఈ విషయం ఆరా తీయడానికి రాజు రక్తవర్ణుడు అనే అంతరంగికుణ్ణి నియమించాడు.

రక్తవర్ణుడు ప్రజల మధ్యకు వెళ్ళి, వారిలో ఒకడుగా జీవిస్తూ, చాలా రహస్యాలు తెలుసుకున్నాడు. దేశంలో కొందరు ధనమూ, బలమూ కలవారు రాజోద్యోగులను సైతం లొంగదీసుకుని, ప్రజలకు అన్యాయం చేస్తున్నారు. వారు చేసే అన్యాయాన్ని బయటపెట్టే ధైర్యం ఎవరికీ లేదు. ఎందుకంటే అన్యాయం చేసేవారే రాజు ఉదారసేనుడి ముఖ్య సలహాదార్లు.

ఈ రహస్యం రక్తవర్ణుడికి తెలిసేసరికి, ఆ సంగతి దేశంలోని ధనికులకు కూడా తెలిసిపోయింది. వాళ్ళు అతన్ని పిలిచి, రాజుకు తమను గురించి మంచిగా చెప్పమని మంచిగానే అడిగారు. వాళ్ళు చెప్పినట్టు చెయ్యకపోతే తనకూ, తన కుటుంబానికీ ప్రమాదం ఉంటుందని రక్తవర్ణుడికి అర్థమయింది.

అతను రాజుగారి దగ్గిరికివెళ్ళి, తన అనుభవాలను గురించి గూఢార్థంగా ఇలా చెప్పాడు:

"మహాప్రభూ, దేశంలో కరువు కాటకాలు ఎందుకు వస్తున్నవో, పేదరికం ఇంకా ఎందుకు ఉంటున్నదో నాకు తెలియకుండా ఉన్నది. మన దేశంలో పలువిధాల సమర్థులైన వారున్నారు.

"వసుంధర"




కొంతమంచి రాళ్ళను బియ్యంగా మార్చ గలరు. కొంతమంది నీళ్ళను పాలుగా మార్చగలరు. ఒక దేవత సహాయంతో ఇంకో దేవత చేత దాస్యం చేయించు కోవడం కొందరికి చాతనవును. మహా సముద్రానికి కూడా ఆనకట్ట కట్టగలిగిన వారు దేశంలో ఉన్నారు. తమ పాలనలో ఇలాటి సమర్థులుండగా పేదరికం ఇంక ఎంతో కాలం ఉండదని నాకు తోస్తున్నది."

రక్తవర్ణుడు ఇలా చెప్పిన మీదట ఉదారసేనుడు చాలా సంతోషించాడు. ఆయన రక్తవర్ణుణ్ణి సన్మానించి, దేశం లోని ధనికులందరికీ అభినందన సందే శాలు పంపాడు. తమకు అనుకూలంగా రాజు దగ్గిర చెప్పినందుకు ధనికులు రక్తవర్ణుడికి పెద్ద పెద్ద మొత్తాలు బహూ కరించారు.

ఇలా ఉండగా విశాలదేశంలో వానలు బొత్తిగా పడక, పంటలు పండక, తిండి గింజలకు కరువు వచ్చి, ప్రజలు నానా అగచాట్లూ పడ్డారు.

అప్పుడు ఉదారసేనుడు రక్తవర్ణుణ్ణి పిలిపించి, "ఇదివరలో నువు, మన రాజ్యంలో రాళ్ళను బియ్యంగా మార్చ గలవాళ్ళు ఉన్నట్టు నాతో అన్నావు. ఇప్పుడు వాళ్ళతో అవసరం వచ్చింది. పిలుచుకు వస్తావా?" అని అడిగాడు.

"ఇందుకు ధనగుప్తుడే సమర్థుడు, మహారాజా. మీరు పిలిపించి అడిగితే ఆయన కాదనడని నా నమ్మకం," అన్నాడు రక్తవర్ణుడు.

ఉదారసేనుడు పిలిచేసరికి ధన గుప్తుడు రెక్కలు కట్టుకుని వచ్చివాలాడు.

"నీ శక్తి సామర్థ్యాల మీద మన దేశపు తిండి సమస్య ఆధారపడి ఉన్నది. దేశంలో తిండి గింజలు బొత్తిగా కరు వయాయి. నీకు పదిమంది కూలివాళ్ళను ఇస్తాను. వాళ్ళు నీకు రాళ్ళు ముక్కలు చేసిపెడతారు. వాళ్ళ సాయంతో నువు మన నీలపర్వతాన్ని బియ్యంగా మార్చాలి," అన్నాడు రాజు.

రాజు మాటలకు ధనగుప్తుడు నివ్వెర పోయి, ''అది ఎలా సాధ్యం, ప్రభూ ?'' అన్నాడు.

రాజు చిరాకుపడి, తనతో వాదించ వద్దనీ, వెంటనే వెళ్ళి పని చూడమనీ ధనగుప్తుడితో అన్నాడు.

ధనగుప్తుడు సాహసించి, ''రాజా, మీ కెవరో నా మీద అబద్ధాలు చెప్పారు. రాళ్ళను బియ్యంగా మార్చగలవాడు ఈ భూమి మీద పుట్టి ఉండడు.'' అన్నాడు.

ఈ సారి రాజు కోపం రక్తవర్ణుడి మీదికి మళ్ళింది.



అయితే రక్తవర్ణుడు చలించకుండా, ''ఎందుకో ధనగుప్తుడుగారు అసత్య మాడుతున్నారు. ఆయన రాళ్ళను బియ్యంగా మార్చడం నా కళ్ళతో నేను చూశాను. బియ్యంగా మార్చే రాళ్ళను వీరు వరదయ్యగారి వద్ద కొంటారు.'' అన్నాడు.

ఈ మాటలు విని ధనగుప్తుడు తడ బడ్డాడు. ఇందులో ఏదో రహస్యం ఉందని రాజుకు తోచింది. అప్పటికప్పుడు ఆయన ధనగుప్తుణ్ణీ, రక్తవర్ణుణ్ణీ వెంటబెట్టుకుని వెళ్ళి, విషయం తెలుసుకున్నాడు. ధనగుప్తుడు వరదయ్య వద్ద బియ్యం ప్రమాణంలో ఉండే రాళ్ళు కొని, తొమ్మిది బస్తాల బియ్యంలో ఒక బస్తా రాళ్ళ చొప్పున కలుపుతున్నాడు.

''చూశారా, ప్రభూ? ఈయన ఒక బస్తా రాళ్లను తొమ్మిది బస్తాల బియ్యంలో కలిపి, పది బస్తాల బియ్యం చేస్తున్నాడు. ఇప్పుడైనా ధనగుప్తుడి శక్తి సామర్థ్యాలు గ్రహించారా ?'' అని రక్తవర్ణుడు రాజును అడిగాడు.

''ఇదా వీడి సమర్థత ?'' అని మండిపడి రాజు ఉదారసేనుడు భటులను పిలిచి, ధనగుప్తుణ్ణి వెంటనే ఖైదు చేయించాడు.

ఆయన రక్తవర్ణుడితో, ''ఇలాగే నువ్వు చెప్పిన మిగతా విషయాలలో కూడా

గూఢార్థాలున్నట్టున్నాయి. మళ్ళీ చెప్పు,'' అన్నాడు.

రక్తవర్ణుడు ఇలా చెప్పాడు:

''పాలలో నీరు కలిపి అమ్మితే నీళ్ళను పాలుగా మార్చినట్టేగదా? దేశంలో వ్యాపారస్థులందరూ ఇదే విధంగా అన్ని వస్తువులనూ కల్తీ చేస్తున్నారు. ధనవంతులు లక్ష్మీదేవి అండతో సరస్వతీ ప్రసన్నులైన విద్యావంతుల చేత సేవలు చేయించుకుంటున్నారు. వాళ్ళు ఎంత ప్రజాకంటకులైనా ప్రజలు తిరగబడడం లేదు. అంటే ఈ ధనికులు ప్రజాసముద్రానికి ఆనకట్ట కట్టి, అందువల్ల ప్రతిఫలం పొంది మరింత ధనవంతులవుతున్నారు.''

అన్నీ విని రాజు ఆశ్చర్యపడి, ''దేశంలో ఇన్ని అన్యాయాలు జరుగుతూంటే, నేను నీకు అప్పగించిన బాధ్యత మరిచిపోయి, కులుకుతూ కూర్చున్నావా?'' అని రక్తవర్ణుడి మీద మండిపడ్డాడు.

''నేనేం చేసేది, ప్రభూ? మీరు చేసిన శాసనాలు ఉల్లంఘించినవారికి పెద్ద పెద్ద శిక్షలున్నాయి. కాని నేను దోషులుగా కనుక్కున్న వారందరూ శాసనాలను ధిక్కరించినవాళ్ళే. అయినా వాళ్ళకు ఏ శిక్షా పడలేదు. అందుచేత, వాళ్ళు మీ కన్న బలవంతులై ఉండాలనుకున్నాను. అందుకే వాళ్ళ నేరాన్ని మీకు సూటిగా చెప్పలేకపోయాను,'' అన్నాడు రక్తవర్ణుడు.

''అవును, శాసనాన్ని ఉల్లంఘించి కూడా శిక్ష పొందని వాళ్ళు రాజు కన్న బలవంతులే అవుతారు. అలాటివాళ్ళు నా దేశంలో చాలామంది ఉన్న కారణంగా దేశం అధోగతిలో ఉన్నది. ఈ లోపాన్ని సవరించాలి,'' అని ఉదారసేనుడు దేశంలోని అవినీతిపరులను ఖైదు చేయించి, తన శాసనాలన్నీ సక్రమంగా అమలు జరిగేలా స్వయంగా చూసుకుని, త్వరలోనే దేశంలోని పేదరికాన్ని తొలగించగలిగాడు.



# మర్రి దురాక్రమణ

వజ్రగిరి చక్రవర్తి బలవంతుడు. చుట్టుపక్కల అనేక రాజ్యాలను జయించి తన రాజ్యాన్ని ఎంతో విస్తరింప జేశాడు. తన తండ్రి రాజ్యకాంక్ష రాజకుమారుడు రత్నపాలుడికి నచ్చలేదు.

ఒకనాడు రత్నపాలుడు వేటకుపోతూ నగరం బయట ఒక పెద్ద ఊడలమర్రిని చూశాడు. దాన్ని చూడగానే అతనికి తన తండ్రి గుర్తుకు వచ్చాడు. ఆ మర్రి ఆక్రమించిన మేర ఏ మొక్కా మొలవదు. ఆ మర్రిని కొట్టి, తగలబెట్టి, అది ఆక్రమించిన స్థానంలో అనేక మొక్కలను నాటించి ఇంటికి తిరిగి వచ్చాడు.

కొంతకాలానికి వెళ్ళి చూస్తే అక్కడ ఒక్క చెట్టూ లేదు. మర్రినీడన ఆడుకుని, దాని ఊడలుపట్టి ఉయ్యాలలూగే గొడ్లకాపరి పిల్లలు వాటిని పీకి పారేశారు.

రత్నపాలుడు తన తప్పు తెలుసుకుని, అక్కడ మరొక మర్రిచెట్టు నాటించి, దానికి కంచె ఏర్పాటుచేసి, తన తండ్రిని ద్వేషించటం మానుకున్నాడు. —ఎం. మంజురాణి





# కానుక

ఒక ఊళ్ళో ఒక వేటగాడు ఉండేవాడు. అతను మామూలు వేటగాడు కాదు; అరణ్యంలో ఉండే క్రూరమృగాలను ప్రాణాలతో పట్టి, బోనులలో పెట్టి తెచ్చి, వాటిని కొనే రాజులకూ, మృగశాలలకూ అమ్మి చాలా డబ్బు సంపాదించేవాడు.

ఒకనాడు ఆ వేటగాడి దగ్గిరికి ఒక కుర్రవాడు, పదిహేనేళ్ళవాడు, వచ్చి, "ఈ ఊళ్ళో ఒకావిడ ఉన్నది. ప్రతి శుక్రవారమూ ఆవిడకు పూనకం వస్తుంది. అప్పుడావిడ మీదకు కాళీమాత వచ్చి పలుకుతుంది. ఆ రోజు ఆవిడ వద్దకు ఎక్కడెక్కడి నుంచో భక్తులు వచ్చి, కానుకలు ఇచ్చుకుంటారు. ఇదంతా ఒక పెద్ద మోసం. దీన్ని బయట పెట్టటానికి నువు ఒక పనిచెయ్యాలి," అన్నాడు.

"ఏం చెయ్యమన్నావు?" అని వేటగాడు అడిగాడు.

కుర్రవాడు తన ఆలోచన వేటగాడికి చెప్పాడు.

మరుసటి శుక్రవారం వేటగాడు అలివేలు అనే ఆవిడ ఇంటికి వెళ్ళాడు. అలివేలు పూనకం మీద ఉన్నది. ఆమె చుట్టూ అనేకమంది భక్తులున్నారు. వాళ్ళు తెచ్చిన కానుకలు కళ్ళుచెదిరేలా ఒక పక్క పెట్టి ఉన్నాయి.

వేటగాడు అలివేలు కాళ్ళ మీద పడి, "మన్నించు, తల్లీ. ఇంతకాలమూ నిన్ను నమ్మకుండా ఎంతో పాపం చేసుకున్నాను. నిన్ను ప్రత్యక్షంగా చూశాక నా కళ్ళు తెరుచుకున్నాయి. వచ్చే శుక్రవారం నీకు తగిన గొప్పకానుక—ఏ భక్తుడూ ఇచ్చుకోలేనిది—తెచ్చి ఇస్తాను. స్వీకరించి నన్ను అనుగ్రహించాలి, మాతా!" అన్నాడు.

కాళీమాత పూని ఉన్న అలివేలు ఆ కొత్త భక్తుణ్ణి ఆశీర్వదించింది.

ఎం. కామేశ్వరరావు

వేటగాడు వెళ్ళిపోయాక భక్తులలో కుతూహలం బయలుదేరింది. ఈ కొత్త భక్తుడు ఎవరు ? ఎవరూ ఇయ్యని కానుక వాడు ఏమిటి ఇస్తాడు ? కుతూహలంకొద్దీ మరుసటి శుక్రవారంనాటికి అలివేలు ఇంటికి భక్తులు మామూలుకన్న కూడా చాలా హెచ్చు సంఖ్యలో వచ్చారు.

కొత్త భక్తుడు ఎంతకీ రాలేదు. వేళ మించిపోతున్నది. భక్తులకు ప్రసాదం పెట్టి పంపించే సమయం దాటిపోయింది. అలివేలు మీద కాళీమాత మరింత బలంగా పూని, మోసంచేసిన ఆ భక్తుణ్ణి శాపనార్థాలు పెట్టసాగింది. అంతలో వేటగాడు వచ్చాడు. అతని చేతిలో కానుక ఏదీలేదు.

"కానుక ఏదిరా, భక్తా? నా తోనే పరాచికాలాడతావురా, మూఢుడా?" అని అలివేలు గర్జించింది.

"కానుక బయట ఉన్నది. చూతువు రా, తల్లీ!" అన్నాడు వేటగాడు.

అలివేలుతోబాటు భక్తులంతా బయటికి వచ్చారు. బయట ఒక బోనూ, అందులో అటూ, ఇటూ తిరుగుతూ ఒక పెద్దపులీ కనిపించాయి.

"తల్లీ, ఇదుగో నీ వాహనం! ఈ భక్తుడి ఈ చిన్నకానుక స్వీకరించి, ఇక నువు నీ వాహనం మీద తిరుగు!" అంటూ వేటగాడు బోను తలుపు తీయబోయాడు.



భక్తులు వణికిపోయారు. పులి గాండ్రుమన్నది. అలివేలు కెవ్వున అరిచి, "వద్దు, వద్దు! తలుపు తీయకు!" అంటూ కంపించిపోయింది.

"అలా బెదురుతావేం, మాతా? నీ వాహనాన్ని ఎక్కి మా భక్తుల కళ్ళు పావనంచెయ్యి." అంటూ వేటగాడు పులి బోను తలుపు మరొకసారి తెరవబోయాడు.

అలివేలు లోపలికి పారిపోబోయింది. వేటగాడు ఆమె దారికి అడ్డం నిలబడి, "ఇంక ఈ నాటకం ఆపు. నువు కాళీ మాతవైతే పులి మీద ఎక్కు; కాకపోతే, ఇన్నాళ్ళూ ఇంతమందినీ మోసంచేశానని

ఒప్పుకో. అప్పుడు నిన్ను పులి మింగినా పాపం లేదు.'' అన్నాడు.

అలివేలు జవాబు చెప్పక బెదురు కళ్ళతో దిక్కులు చూస్తుంటే భక్తులు నిజం తెలుసుకున్నారు. అలివేలు భర్త ఏదో సర్దిచెప్పబోతే వాళ్లు అతన్ని అవతలికి ఈడ్చేశారు.

''నన్ను ఆ పులివాత వెయ్యకు! నేను లోకాన్ని ఇంతకాలమూ మోసగించినమాట నిజమే!'' అంటూ అలివేలు ఏడ్చింది.

భక్తులందరూ కసికొద్దీ అలివేలును నానామాటలూ అన్నారు. ఆమె భర్త భక్తుల కానుకలు భక్తులకు తిరిగి ఇచ్చేశాడు. వేటగాడు పులిబోనును తోసుకుంటూ వెళ్ళిపోయాడు. అతను ఇంటికి చేరేసరికి ఆ పదిహేనేళ్ళ కుర్రవాడు అక్కడే ఉండి, ఏం జరిగిందని అడిగాడు.

''నువు చెప్పినట్టే జరిగింది. ఆ మనిషి మోసం ఒప్పుకున్నది. కాని, లోకంలో ఎంతోమంది బతుకుతెరువు కోసం ఎన్నో మోసాలు చేస్తారు. నువు పనిపెట్టుకుని ఆ మనిషి నోటిముందు కూడు ఎందుకు చెడగొట్టావు? ఆమె మీద నీ కెందుకు పగ?'' అని వేటగాడు కుర్రాణ్ణి అడిగాడు.

''ఆమె మీద నాకు పగ లేదు. ఆమె మా అమ్మ. ఆవిడను ఈ మోసంలోకి దింపినది మా నాన్న. ఆయన వట్టి సోమరి. చేస్తున్న ఉద్యోగం మానటానికి మా అమ్మను అడ్డం పెట్టుకున్నాడు. నాకు ప్రపంచజ్ఞానం తెలుస్తున్నది. మా అమ్మా, నాన్నా ఆడే నాటకం ఎప్పటికైనా బయట పడకపోదు. నేను ఎలా తల ఎత్తుకు తిరగాలి? నీ దయ వల్ల అది వెంటనే జరిగింది. నేను నా కాళ్ళ మీద నిలబడే నాటికి ఈ కథ ఎవరికీ గుర్తుండదు. నీ శ్రమకు ప్రతిఫలంగా ఈ డబ్బు పుచ్చుకో,'' అంటూ అలివేలు కొడుకు వేటగాడికి డబ్బు ఇయ్యబోయాడు.

''మంచి పుణ్యకార్యం నా చేత చేయించావు. డబ్బు పుచ్చుకోకూడదు,'' అంటూ వేటగాడు ఆ కుర్రవాణ్ణి వీధి చివరదాకా సాగనంపాడు.





# పెళ్ళికొడుకు

రామాపురం గ్రామంలో సుబ్బారాయుడూ, శకుంతలమ్మా అనే దంపతులుండేవారు. ఎన్ని నోములు నోచినా, ఎన్ని వ్రతాలు చేసినా వారికి సంతానం కలగలేదు. అయితే ఒక రోజు వారి ఇంటికి ఒక సాధువు వచ్చి, శకుంతలమ్మకు చిటికెడు విభూతి ఇచ్చి, దాన్ని ఆమె నీటిలో కలిపి తాగితే కొడుకు పుట్టుతాడనీ, వాడు పెళ్ళి అయేదాకా మందమతిలాగా ఉంటాడనీ, పెళ్ళికాగానే వాడిలో మామూలు తెలివి తేటలు కనిపిస్తాయనీ, వాడికి ''పెళ్ళి కొడుకు'' అని పేరు పెట్టవలసిందనీ చెప్పాడు.

అంతా ఆ సాధువు చెప్పినట్టే జరిగింది. సంవత్సరం తిరిగే లోపల శకుంతలమ్మకు పండులాటి బిడ్డ కలిగాడు., వాడికి పెళ్ళి కొడుకు అని పేరు పెట్టారు. పేరుకు తగినట్టుగా ఉండాలని, తల్లిదండ్రులు వాణ్ణి చిన్నతనం నుంచీ పెళ్ళికొడుకు వేషంలోనే ఉంచారు.

అయిదేళ్ళు నిండగానే పెళ్ళికొడుక్కు అక్షరాభ్యాసం చేసి, చదువులో పెట్టారు. నామ మాత్రంగా వాడు యుక్తవయస్కుడైనదాకా చదువుకున్నాడన్న మాటేగాని, వాడికి చదువు ఏ మాత్రమూ అంటినట్టు కనబడలేదు. తరవాత చదువు మానేసి, పట్టుపంచెలు కట్టుకుని, నిలువు బొట్టు పెట్టుకుని, పెళ్ళికొడుకు వేషంలో వీధుల వెంట తిరగసాగాడు. చూడ ముచ్చటగా ఉన్నా, వాడి పేరే పెళ్ళికొడుకు అయినా, వాడు శుద్ధ మొద్దు అన్న అభిప్రాయంతో ఊళ్ళో ఎవరూ వాడికి పిల్లనియ్యటానికి ముందుకు రాలేదు.

ఒకరోజు సుబ్బారాయుడు తన భార్యతోనూ, కొడుకుతోనూ దూర ప్రయాణం చెయ్యవలసి వచ్చింది. మార్గ మధ్యంలో

చామర్తి రవిప్రకాశరావు

ఒక ఊరి పొలిమేరలో వాళ్ళ బండి ఆగిపోయింది. దారికి అడ్డంగా చాలా మంది నిలబడి తగాదా పడుతున్నారు. పక్కనున్న ఇంట పెళ్ళి జరుగుతున్నది. కట్నం దగ్గిర పేచీ రావటంతో, ఉభయ పక్షాలవారూ తీవ్రంగా ఘర్షణ పడుతున్నారు.

ఈ గొడవ యిప్పట్లో తేలేది కాదని, పెళ్ళికొడుకు బండి దిగి, అలా చుట్టూ కలయచూస్తూ ముందుకు కదిలాడు. వాడికి పెళ్ళి పందిట్లో బాజా భజంత్రీల మోత వినిపించింది. అక్కడ పెళ్ళి తంతు చూద్దామనుకుని వాడు, పెళ్ళి పందిట్లోకి నడుచుకుంటూ వెళ్ళాడు.

ఎంతో సేపటినుంచి పెళ్లికొడుకు కోసం చూస్తున్న పురోహితుడు అతన్ని చూసి కొంచెం అనుమానంగా, "నువు ఎవరు, బాబూ ?" అని అడిగాడు.

అతను తన పేరు అడుగుతున్నాడనుకుని పెళ్ళికొడుకు, "నేను పెళ్ళి కొడుకును," అన్నాడు.

పెళ్ళి పురోహితుడు తగాదా పరిష్కారమయిందనీ, పెళ్ళికొడుకును పంపారనీ అనుకుని, వాణ్ణి వెంటనే పెళ్లిపీట మీద కూర్చొమని ఆహ్వానించి, పెళ్ళితంతు ప్రారంభించాడు.

బయట తగాదా తెగనేలేదు. పెళ్ళి కూతురు తండ్రి పెళ్ళి ఆపుదామని పందిట్లోకి వచ్చేసరికి, పెళ్లి కొంత అయేపోయింది. పెళ్ళికొడుకు నిక్షేపంగా ఉన్నాడు. వివరాలు తరవాత తెలుసుకోవచ్చునని పెళ్ళికూతురు తండ్రి చూస్తూ ఊరుకున్నాడు.

ఆ విధంగా పెళ్ళికొడుకు వివాహం జరిగిపోయింది. వాడి తల్లిదండ్రులు అప్రయత్నంగా జరిగిపోయిన, తమ కొడుకు వివాహానికి చాలా సంతోషించారు. సాధువు చెప్పినట్టే, పెళ్లికాగానే పెళ్లి కొడుక్కు తాను చదువుకున్న చదువంతా జ్ఞాపకం వచ్చింది. ఆ తరవాత వాడు నలుగురిచేతా మంచి తెలివిగలవాడని పించుకున్నాడు.



# పందెం

కాంచీపుర రాజు చంద్రవర్మ ఆస్థానానికి ఒకరోజు ఒక జ్యోతిష్కుడు వచ్చి, "మీ రాజ్యం నెల దినాలలో పరుల అధీనంలోకి పోనున్నది," అని రాజుతో అన్నాడు.

జ్యోతిషంలో నమ్మకం ఉన్న రాజు ఈ మాట విని హడలిపోయాడు. మంత్రి అది గ్రహించి, జ్యోతిష్కుడితో, "అలా జరగకపోతే నీకు శిరశ్ఛేదం చేయిస్తాను," అన్నాడు.

"అలా జరిగితే నాకు లక్ష వరహాలు ఇచ్చేటట్టు పందెం కట్టండి," అన్నాడు జ్యోతిష్కుడు.

మంత్రి సరేనన్నాడు. ఆ రోజే మంత్రి చంద్రవర్మను కాశీయాత్రకు పంపేసి, తాను రాజ్యభారం చూడసాగాడు.

నెల గడిచింది. రాజు తిరిగివచ్చి, తిరిగి సింహాసనం మీద కూర్చున్నాడు.

జ్యోతిష్కుడు వచ్చి మంత్రితో, "నాకు లక్ష వరహాలు ఇప్పించండి," అన్నాడు.

మంత్రి ఒక్కక్షణం ఆలోచించి, జ్యోతిష్కుడికి లక్ష వరహాలు ఇప్పించాడు.

—భైరి సత్యనారాయణ






# గొంతెమ్మ కోరికలు

చీనా దేశంలో మారుమూల కొండ ప్రాంతాన ఒక ప్రాచీన దేవత ఆలయం ఉండేది. ఆ ఆలయంలో ఒక్క రాత్రి నిద్రిస్తే దేవత ఎవరి కోరికలనైనా తీర్చుతుందని ఒక నమ్మకం ఉండేది.

ఆ ఆలయానికి కొంత దూరంలో, ఒక గ్రామంలో చిన్-ను అనే ఏకాకి ఉండేవాడు. వాడు అమిత సోమరి. ఒక పూట పనిలోకి పోతే, రెండు పూటలు మానేసేవాడు. కష్టపడకుండా సుఖపడాలన్నది వాడి ఆశయం. వాడికి దేవత గురించి ఎవరో చెప్పారు.

వెంటనే చిన్-ను మూటా ముల్లే కట్టుకుని, కొండకు ప్రయాణమై వెళ్లాడు. చీకటిపడే వేళకు గుడి చేరుకుని, దేవతకు నమస్కారాలు చేసి, గుడిలోనే పడుకుని నిద్రపోయాడు. నిద్రలో వాడికి ఒక కల వచ్చింది.

కలలో దేవత కనిపించి, "నీ కోరిక నాకు తెలుసు. నీకు రోజుకు పది డబ్బులు దొరికే ఏర్పాటు చెయ్యగలను. కాని దానితో నువు సుఖపడగలవనుకుంటున్నావా ?" అని అడిగింది.

"అది చాలు తల్లీ. ఆ ఏర్పాటు చేశావంటే ఈ లోకంలో నా కన్న సుఖప్రాణి ఉండడు," అన్నాడు చిన్-ను.

"అలాగే," అని దేవత అదృశ్యమయింది. చిన్-ను చప్పున లేచి కూర్చున్నాడు. వాడి పక్కనే ఒక తోలు సంచీ ఉన్నది. అందులో పది డబ్బులున్నాయి.

దేవత శక్తి రుజువయింది. కల నిజమయింది. చిన్-ను సంబరపడిపోతూ, ఆ పది కాసులూ తీసుకుని, సంచీలో మళ్లీ చెయ్యి పెట్టి చూశాడు. సంచీ ఖాళీగా ఉన్నది. అంటే ఆ సంచీ తనకు రోజుకు పది డబ్బులే ఇస్తుందన్నమాట !

వీరేపల్లి జయరాంరెడ్డి

వాడు ఆ సంచీతో తన గ్రామానికి తిరిగి వచ్చి, రోజూ సంచీలో దొరికే పది డబ్బులతో తిండి కొనుక్కునేవాడు.

సంచీ దొరికినాక చిన్-ను పని చెయ్యడమే మానుకున్నాడు. ఊరికే తిని కూర్చోడంతో వాడికి అజీర్తి చేసి, తిండి మీద మొహం మొత్తింది. జీవిత మంటే తిండి తినడం మాత్రమే కాదని వాడికి అనిపించింది.

ఈ స్థితిలో చిన్-ను గ్రామంలో తిరుగుతూ ఒక చక్కని చుక్కను చూశాడు. ఆమె ఒక ధనికుడి కూతురు. ఆమె తప్ప ధనికుడికి ఇంకే పిల్లలూ లేరు. వెయ్యి డబ్బులు ఓలె ఇస్తేగాని ధనికుడు ఆమెను ఇచ్చి పెళ్లి చెయ్యడు. చిన్-నుకు ఆమెను పెళ్లాడాలని తీవ్రమైన కోరిక కలిగింది. కాని వెయ్యి డబ్బులు ఎక్కడి నుంచి తెచ్చేటట్టు ?

చిన్-నుకు ఒక ఆలోచన తట్టింది. వాడు తన సంచీని ఆ వూరి షావుకారు దగ్గిరికి తీసుకుపోయి, దాని మహిమ ఆయనకు నిరూపించి, దాన్ని తాకట్టు పెట్టి వెయ్యి డబ్బులు అప్పు తెచ్చి, ఆ డబ్బుతో ధనికుడి కుమార్తెను పెళ్లాడాడు.

అక్కడి నుంచే వాడి కష్టాలు ఆరంభమయాయి. భార్యనీ, తననూ పోషించుకోవటానికీ, తాకట్టు వస్తువు విడిపించుకోవటానికీ గాను వాడు శరీరం హూనమయేలాగా పని చెయ్యవలసి వచ్చింది. మామగారు అంత డబ్బుండి కూడా చేబదులు కూడా ఇయ్య నిరాకరించాడు.




ఒకవంక వాడి భార్య, ఏదైనా వ్యాపారం ప్రారంభించి, నలుగురిలోనూ తన పరువు నిలబెట్టమని పోరుపెట్టింది. ఆమె పోరు పడలేక చిన్-ను షావుకారు దగ్గిర మరి కొంత అప్పుతెచ్చి, చిల్లరదుకాణం పెట్టి, వ్యాపారం చాతగాక దివాలా తీశాడు.

ఇంతలో షావుకారు బాకీ తీర్చే గడువు దగ్గిరపడింది. ఆ బాకీ తీర్చకపోతే సంచీ తనకు కాకుండా పోతుంది. బాకీ తీర్చాలంటే తన దగ్గిర చిల్లిడబ్బు లేదు.

గడువు రేపనగా చిన్-ను తన భార్యను అడిగి చూశాడు. తన మొగుడు ఏమీ చేతగాని దద్దమ్మ అన్న అలుసు ఆమెకు అదివరకే ఏర్పడి ఉన్నది.

"వెధవసంచీ పోతేపోయింది! దాని కోసం ఎందుకు ఆరాటపడతావు? కాక పోయినా, దాన్ని నమ్ముకుని నన్ను ఏమని పెళ్ళాడావు?" అన్న దామె నిర్లక్ష్యంగా.

చిన్-ను మండిపడి తన భార్య చెంప పగలగొట్టాడు. ఆమె అలిగి పుట్టింటికి వెళ్ళిపోయింది.

పెళ్ళాం వెళ్ళిపోయినందుకన్న, సంచీ తనకు దక్కకుండా పోతున్నందుకు చిన్-ను చాలా బాధపడి, ఆ రాత్రి నిద్ర పోలేదు. అర్ధరాత్రి దాటాక, వాడు తెగబడి షావుకారు ఇంట దొంగతనంగా ప్రవేశించి, తన సంచీని పట్టుకువచ్చాడు. అదృష్ట వశాన వాణ్ణి ఎవరూ పట్టుకోలేదు.

సంచీ చేతికి వచ్చినాక చిన్-ను తన భార్య కోసం బెంగపడ్డాడు. వాడు ధనికుడి ఇంటికి వెళ్ళి, తన భార్యను రమ్మని పిలిచాడు. ఆమె వాణ్ణి అవమానించి వెళ్ళగొట్టింది.

వాడి బుర్ర అవమానభారంతో పూర్తిగా చెడింది. వాడు మద్యశాలకు వెళ్ళి, తప్ప తాగాడు. చివరకు సంచీలో నుంచి పది డబ్బులు తీసి దుకాణదారు చేతిలో పెడితే, దుకాణంవాడు ఆ సంచీలో ఇంకా డబ్బు ఉన్నదనుకుని, తనకు రావలసిన దంతా రాబట్టుకునేటందు కోసం సంచీని లాక్కోబోయాడు.

చిన్-ను మండిపడి, పక్కనే ఉన్న దుడ్డుకర్రతో దుకాణంవాణ్ణి కొట్టాడు. నలుగురూ మూగారు. అదేసమయంలో షావుకారు భటులతో వచ్చి, చిన్-నును వాళ్ళకు పట్టిఇచ్చాడు.

చిన్-నుకు ఆ సంచీ మీద ఎక్కడలేని అసహ్యమూ పుట్టింది. తన కష్టాలన్నిటికీ అదే మూలమైనట్టు వాడికి తోచింది. వాడు దాన్ని అందరూ చూస్తూండగానే చలిమంటలోకి విసిరివేసి, భటుల వెంట వెళ్ళిపోయాడు.





# అవినీతి దెబ్బ

శెళ్ళంగెరి అనే పట్టణంలో గోపాలయ్య అనే ఉద్యోగి ఉండేవాడు. అతను సంపాయించే జీతం అతనూ, అతని భార్య తాయారమ్మా హాయిగా జీవించడానికి సరిపోయేది.

అతని ఇరుగుపొరుగు వారందరూ ధనికులు, పెద్దమేడలలో ఉండేవారు. వారి ఆడవారందరూ ఎప్పుడూ పట్టుచీరలే కట్టి, వజ్రాల ఆభరణాలు ధరించి దర్జాగా ఉండేవారు. వారిని చూసిన తాయారమ్మ వారిలాగే పెద్దమేడలో ఉండి, పట్టుచీరలు కట్టి, వజ్రాల ఆభరణాలు ధరించాలనుకోసాగింది. కాని గోపాలయ్య ఆదాయంతో అది సాధ్యంకాదు. అందుచేత, గొంతెమ్మ కోరికలు వద్దని గోపాలయ్య భార్యకు చెప్పాడు.

"రాజుగారి ఆస్థానంలో ఉండి ఎంత మంది రెండుచేతులా ఆర్జించటంలేదు. అదిచేతగాని మిమ్మల్ని కట్టుకోవటం నా దురదృష్టం. జీవితాంతం అనుభవించాల్సిందే!" అని తాయారమ్మ రోజూ భర్తను పోరుపెట్టింది.

ఆమె పోరుపడలేక గోపాలయ్య అవినీతికి పాల్పడి, డబ్బు సంపాదించటం ప్రారంభించి, రెండేళ్ళలో ఒక లక్ష రూపాయలు కూడబెట్టాడు. ఈ డబ్బుతో రెండు మేడలూ, మూడెకరాల మాగాణీ భూమీ, తాయారమ్మకు పట్టుచీరలూ, రవ్వలఆభరణాలూ కొందామనుకునేసరికి అతనికి ఒక పెద్ద సమస్య ఎదురయింది. తను గొప్ప సంపన్నుడయాడని తెలిసి, ఇంత డబ్బు ఎలా వచ్చిందని రాజు అడిగితే ఏం చెప్పాలి?

"మీ స్నేహితుడు గోవిందయ్యశెట్టి దగ్గిర అప్పు తీసుకున్నట్టు నాటకం ఆడితే సరిపోదూ?" అన్నది తాయారమ్మ.

కోలార్ కృష్ణఅయ్యర్

గోపాలయ్య గోవిందయ్యశెట్టి వద్దకు వెళ్ళి, విషయమంతా చెప్పి, "నీ కొక దొంగ అప్పుపత్రం రాసిస్తా. రాజుగారు విచారణ జరిపితే నాకు అప్పు ఇచ్చానని ఆయనగారితో చెప్పు. కొంతకాలం గడిచాక ఆ పత్రం చించి పారెయ్యొచ్చు." అన్నాడు.

గోవిందయ్యశెట్టి సరే నన్నాడు.

గోపాలయ్య తాను అక్రమంగా సంపాదించిన డబ్బుతో మేడలూ, పొలమూ, తన భార్యకు పట్టుచీరలూ, వజ్రాల నగలూ కొన్నాడు. ఒక మేడలో తాను కాపురం ఉంటూ, రెండో మేడను అద్దె కిచ్చాడు.

"భూమి నుంచి ధాన్యం వస్తుంది. పైఖర్చుకు అద్దె డబ్బు వస్తుంది. మీరు రాజుగారి కొలువు మానెయ్యండి. రాజుగారి బెడద కూడా పోవచ్చు." అని తాయారమ్మ గోపాలయ్యకు సలహా ఇచ్చింది. గోపాలయ్య భార్య చెప్పినట్టే చేశాడు.

ఒకరోజు గోవిందయ్యశెట్టి అకస్మాత్తుగా చనిపోయాడు. అతడి ఆస్తికి వారసు లెవరూ లేనికారణంచేత, అది రాజుకే చెందుతుంది. రాజోద్యోగులు వచ్చి శెట్టి తాలూకు స్థిరచరాస్తులు స్వాధీనం చేసుకున్నారు. అందులో అనేక అప్పుపత్రాలతో బాటు గోపాలయ్య రాసియిచ్చిన పత్రం కూడా ఉన్నది.

గోపాలయ్య తన ఉత్తుత్త బాకీని రాజుగారికి తీర్చవలసివచ్చింది. అతని దగ్గిర వేరే డబ్బు లేకపోవటంచేత గోపాలయ్య స్థిరచరాస్తులన్నిటినీ జప్తు చేసి, వేలం వేశారు. అతని అక్రమ సంపాదన పోగా, తాయారమ్మ బుద్ధితక్కువ సలహా వల్ల ఉన్న ఉద్యోగం కూడా పోయింది. అతనికి బిచ్చమెత్తుకోవటం తప్ప వేరే మార్గం ఏదీ మిగలలేదు. ఆ పని చెయ్యటానికి గోపాలయ్య పుట్టిపెరిగిన పట్టణం వదిలి తన భార్యతో సహా మరొక దేశం వెళ్ళి, అక్కడ భిక్షాటన చేస్తూ దుఃఖంతో జీవించసాగాడు.





# సందీపవర్తకుడు

సందీపలో హీరాదత్తుడు అనే ధనికుడైన సముద్ర వర్తకుడుండేవాడు. అతని సరుకులు ద్వీపాంతరాలలో మంచి గిరాకీ కలిగి, అతనికి అంతులేని లాభాలు చేకూర్చేవి. అయితే అతనికి మూఢ నమ్మకాలుండేవి. ముఖ్యంగా అతను శకునాలను పాటించేవాడు.

సందీపలో ఇంకా కొందరు వర్తకులు ఉండేవారు, కాని వారు హీరాదత్తుడికి చాలరు. అసూయతో వారు హీరాదత్తుడి మీద కక్ష పెట్టుకుని, అతనికి ద్రోహం చెయ్యగోరారు. ఇలాటి వారిలో ముఖ్యుడు హీరాదత్తుడి దాయాది సోమదత్తుడు. హీరాదత్తుడికి శకునాలలోగల నమ్మకాన్ని ఆధారం చేసుకుని అతను హీరాదత్తుణ్ణి నాశనంచేయ సంకల్పించాడు.

ఒకసారి హీరాదత్తుడు చాలా హెచ్చు సరుకుతో సువర్ణద్వీపానికి ప్రయాణం తలపెట్టాడు. అందుకుగాను అతను తనకున్న ధనంలో సగం వెచ్చించి సరుకు కొని ఓడలకు ఎత్తించాడు. ఇదే అదను అనుకుని సోమదత్తుడు తన మిత్రులతో సంప్రతించి, నావికులుగా తమ మనుషులను ఆ పడవలోకి పంపాడు. ఈ కుట్ర గురించి హీరాదత్తుడికి ఏ మాత్రమూ తెలియదు. ఓడలు లంగరెత్తి కొద్దిదూరం పోగానే సోమదత్తుడి మనుషులు ఓడలకు చిల్లులు పెట్టి, చిన్న చిన్న తెప్పలలో తీరానికి తిరిగి వెళ్ళారు. తరవాత కొద్దిసేపటికి ఓడలు సరుకుతో సహా సముద్రంలో మునిగిపోయాయి. హీరాదత్తుడూ, అతని మనుషులూ చిన్న తెప్పలలో ప్రాణాలు దక్కించుకుని తీరానికి తిరిగి రాగలిగారు.

ఇదేదో ప్రమాదంవల్ల జరిగి ఉంటుందనుకుని హీరాదత్తుడు మరొక సముద్ర

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



ప్రయాణం తలపెట్టి, ఈసారి కొద్ది ఓడలలో తక్కువ సరుకు వేశాడు. కాని ఈసారి కూడా సోమదత్తుడు పాత యుక్తితోనే మళ్ళీ ఓడలను ముంచేశాడు.

ఈ దెబ్బతో హీరాదత్తుడు మానసికంగానూ, ఆర్థికంగానూ పూర్తిగా చితికిపోయాడు. ఇది బలమైన దుశ్శకునమనీ, తనకు ఇక జన్మలో సముద్రవర్తకం చేసే గీత లేదనీ అతనికి నమ్మకం కలిగిపోయింది. ''నా సరుకుగల ఓడలు తెరచాప ఎత్తితే తప్పక మునిగిపోతాయి,'' అంటూ అతను మనోవ్యాధికి గురిఅయాడు.

అనేకమంది మిత్రులు హీరాదత్తుడి నిరాశా నిస్పృహలను పోగొట్ట యత్నించారు. కాని అతను, ''నా రోజులు బాగా లేవు. నా ఓడలు నీటి మీద తేలవు. నన్ను దుష్టగ్రహాలు ఆవేశించాయి,'' అన్నాడు.

అతని శత్రువులు అతని ఈ నిస్పృహను తెలివిగా ఎగదోశారు.

సందీప రాజైన ప్రతాపరాజుకు హీరాదత్తు డంటే చాలా అభిమానం. హీరాదత్తుడి దీనస్థితి గురించి ఆయనకు త్వరలోనే తెలియవచ్చింది. హీరాదత్తుడు ఈసారి చేసే సముద్రవర్తకానికి, ఆయన ధన సహాయం చేతామనుకున్నాడు, కాని హీరాదత్తుడు అందుకు ఆసక్తి కనబరచలేదు. ''మహారాజా, ఎందుకొచ్చినది ? నా ఓడలు మునిగిపోవటం తథ్యం,'' అనేశాడు.

ఆయన నిండు సభలో, ''మన వర్తకుడి మనసుమార్చే మార్గం ఏమిటి?" అని అడిగాడు. ఎవరూ మాట్లాడలేదు. కాని, ఆస్థాన ఇంద్రజాలికుడు సోమనాథుడు, ''మహారాజా, నాకు కొద్దిరోజులు గడువు ఇస్తే, నా ఇంద్రజాలం ద్వారా హీరాదత్తుడి మనసు మార్చటానికి ప్రయత్నిస్తాను,'' అన్నాడు.

సోమదత్తుడు హీరాదత్తుడి మనసు విరచటానికి చేసిన పన్నాగాలలో ఒకటి ఏమిటంటే, ఒక సాముద్రికవేత్తను తెచ్చి,

హీరాదత్తుడి చెయ్యి చూపించి, అతని జీవితానికి ఇంక మంచి రోజులంటూ ఉండవని చెప్పించాడు.

ఈ సంగతి ఐంద్రజాలికుడు సోమనాధుడికి తెలుసు. ఆయన ఆస్థాన జ్యోతిష్కుడూ, సిద్ధాంతీ అయిన వాణ్ణి హీరాదత్తుడి వద్దకు తీసుకువచ్చి, హీరాదత్తుడి చెయ్యీ, జాతకమూ చూపించాడు. సిద్ధాంతి రెండూ పరిశీలించి హీరాదత్తుడి భవిష్యత్తు దివ్యంగా ఉన్నదని చెప్పాడు.

అయినా హీరాదత్తుడు సముద్ర వర్తకం చెయ్యటానికి ఒప్పుకోక, సోమనాధుడితో, "సముద్రం మీద నాకు అదృష్టం కలిసి రాదు. ఒకసారి కాదు, వరసగా రెండుసార్లు నా ఓడలు మునిగిపోయాయి," అన్నాడు.

"ఈ సారి నేను మీ వెంట వస్తాను. నాకు ఇంద్రజాలం తెలుసునని మీరెరుగుదురు గదా! అదీగాక రాజుగారు ఓడల మీద రక్షక భటులను పంపుతారు," అన్నాడు సోమనాధుడు.

"ఓడలు మునిగిపోవాలని రాసిపెట్టి ఉంటే ఇంద్రజాలం ఆపుతుందా?" అని హీరాదత్తుడు అడిగాడు.

"నా ఇంద్రజాలం విధిని కూడా జయిస్తుంది. ఇవాళ అపరాహ్ణం మా యింటికి




వస్తే ఆ సంగతి కళ్ళారా చూపిస్తాను," అన్నాడు సోమనాధుడు.

ఆ ప్రకారమే హీరాదత్తుడు సోమనాధుడి ఇంటికి వెళ్ళాడు. సోమనాధుడు ఒక గ్లాసునిండా నీరు నింపి తెచ్చి, హీరాదత్తుడి ముందు బల్లమీద పెట్టాడు. అతను హీరాదత్తుడికి ఒక సూది ఇచ్చి, దాన్ని నీటిలో వెయ్యమన్నాడు. సూది నీటిలో మునిగి, గ్లాసు అడుగుకు దిగింది. సోమనాధుడు దాన్ని బయటికి తీసి, హీరాదత్తుడి కిచ్చి, అది నీటి మీద తేలేలాగు చూడమన్నాడు. హీరాదత్తుడు ఎంత ప్రయత్నించినా సూది నీటిలో మునిగింది గాని, తేలలేదు.

సోమనాథుడు తన కొడుకుని పిలిచి, హీరాదత్తుడికి ఫలహారం పెట్టించమని చెప్పి, కొడుకు వెంట అతన్ని భోజన శాలకు పంపాడు. హీరాదత్తుడు వెళ్ళగానే సోమనాథుడు సూదిని తడి లేకుండా శుభ్రంగా తుడిచి, సన్నటి తీగె కొక్కెం మీద సూదిని ఉంచి, నింపాదిగా రెంటినీ నీటిలోకి వదిలాడు. తీగ కొక్కెం నీటిలో మునిగింది గాని, సూది నీటిమీద తేలింది. అతను సూదిని నీటిపైనే ఉండనిచ్చి, గ్లాసులో మునిగిన తీగ కొక్కాన్ని ఉపాయంగా బయటికి తీసి, దాచాడు.

ఫలహారం పూర్తి చేసి తిరిగి వస్తూనే హీరాదత్తుడు, గ్లాసులో తేలుతున్న సూదిని చూసి నిర్ఘాంతపోయాడు.

"ఇది అద్భుతం!" అన్నాడతను.

"అవును. నేను ఓడలో ఉండగా అది మునగటానికి వీల్లేదు." అన్నాడు సోమనాథుడు.

సోమనాథుడి ఇంద్రజాలంతో హీరాదత్తుడికి కొంత మనోబలం ఏర్పడింది. అతను మరొక సముద్రయానానికి కావలసిన ప్రయత్నాలు చేశాడు. ఈ సారి ప్రయత్నంలో సోమనాథుడు ఉండబోతాడనీ, అందులో రాజుగారి ప్రమేయం ఉన్నదనీ ఎవరికీ తెలియకుండా జాగ్రత్త పడ్డారు. నావికులను ఎన్నుకునేటప్పుడు సోమదత్తుడి మనుషులు మళ్ళీ జొరబడ్డారు. అయితే ఓడల మీద మారు వేషాలలో సోమనాథుడూ, రాజుగారి గూఢచారులూ ఉన్నారు. అర్థరాత్రి వేళ దుర్మార్గులు ఓడలకు చిల్లులుపెట్ట యత్నించగానే రాజుగారి మనుషులు వారిని పట్టుకున్నారు.

దుర్మార్గుల విచారణ రాజసభలో జరిగింది. తమను నియోగించిన వర్తకుల పేర్లు వాళ్ళు చెప్పారు. సోమదత్తుడికీ, అతని అనుచరులకూ శిక్షలు పడ్డాయి.

హీరాదత్తుడి సాహసం పూర్తిగా తిరిగి వచ్చింది. అతను ఎప్పటిలాగే తన సరుకులను ద్వీపాంతరాలకు ఎగుమతి చేసి, వర్తకం చేయసాగాడు.





# మాయబంగారం

ఒక గ్రామంలో సిద్దయ్య అనే రైతు తనకు గల కొద్దిపాటి భూమిలో వ్యవసాయం చేసుకుంటూ కుటుంబం పోషించుకునే వాడు. ఒక ఏడు అమితమైన వర్షాల వల్ల పంట పాడై, అతను వీరాచారి వద్ద అప్పు చేశాడు. వీరాచారి చెయ్యితిరిగిన బంగారు పనివాడు.

కొంతకాలానికి సిద్దయ్య బంధువురాలు ఒకామె చచ్చిపోతూ, తన బంగారంలో కొంత అతని పేర రాసి పోయింది. ఆ బంగారం చేతికిరాగానే సిద్దయ్య వీరాచారి బాకీ తీర్చాడు. కొంత బంగారం పెట్టి సిద్దయ్య భార్య వీరాచారి చేత నగ చేయించుకున్నది. వీరాచారి బంగారంలో సగానికి సగం రాగి కలిపి, నగ మాత్రం మహా కుదురుగా చేసి ఇచ్చాడు.

వీరాచారి కూతురు సంక్రాంతిపండగకు పుట్టింటికి వచ్చింది. సిద్దయ్య కుటుంబ పరిస్థితి మెరుగయిందని విని, ఆమె వాళ్ళను చూడటానికి వెళ్ళింది. సిద్దయ్య భార్య ఆమెకు తన కొత్తనగ చూపించింది.

వీరాచారి కూతురు ఆ నగ పనితనానికి ముచ్చటపడింది. ఆమె తన తండ్రి వద్దకు వెళ్ళి, " నేను ఎంత మొత్తుకున్నా నాకు అంత అందంగానూ, నాజూకుగానూ నగ చెయ్యావు. కాని సిద్దయ్య భార్యకు చేసి ఇచ్చావు! నా గొలుసు చెడగొట్టి అలాటి నగ చేసి ఇయ్యి. నేను వెళ్ళేలోగా చేసి ఇయ్యకపోతే సిద్దయ్య భార్య నగే తీసుకు పోతాను. తరవాత ఆమెకు నువు చేసి ఇయ్యి," అన్నది.

వీరాచారి కిక్కురుమనకుండా వెంటనే తన కూతురికి నగ చేసి ఇచ్చాడు. అతడు ఊరికి వెళ్ళవలసి ఉన్నది.

వీరాచారి కూతురు ఆ రాత్రి తన నగ తీసుకుని సిద్దయ్య ఇంటికి వెళ్ళింది.

ఎమ్. వి. వి. సత్యనారాయణ

సిద్దయ్య భార్య దాన్ని చూసి మెచ్చుకున్నది. అయితే వీరాచారి కూతురికి సిద్దయ్య భార్య నగే తన నగ కన్న బాగున్నట్టు తోచింది.

వీరాచారి కూతురు సిద్దయ్య భార్యతో, "మనం నగలు మార్చుకుందాం. మీ నగ ఎక్కువ బరువుంటే ఆ వార బంగారం ఇచ్చుకుంటాను. ఒకవేళ నాదే ఎక్కువ బరువుంటే నాకు మీరేమీ ఇయ్యవద్దు," అన్నది.

సిద్దయ్య భార్య కాదనలేకపోయింది. ఇద్దరూ వీరాచారి ఇంటికి వెళ్లారు. వీరాచారి ఊరికి వెళ్ళి ఉండటం చేత వీరాచారి భార్య రెండు నగలూ తూచింది. వీరాచారి కూతురి నగే ఒక్క పిసరు బరువు హెచ్చుగా ఉండటంచేత నగలు అప్పుడే మార్చుకున్నారు.

మర్నాడు వీరాచారి కూతురు అత్తవారింటికి వెళ్ళిపోయింది. ఆమె భర్త ఆ నగను గీటురాయికి పెట్టి చూస్తే రాగి నగ అని తేలిపోయింది. అతను వీరాచారి వద్దకు వెళ్ళి, అతని మీద విరుచుకు పడ్డాడు.

తాను మేలిమిబంగారంతో తన కూతురి కోసం చేసిన నగ ఏమయిందో, సిద్దయ్య భార్య కోసం చేసిన నగ తన కూతురి వద్దకు ఎలా వచ్చిందో వీరాచారికి అంతు బట్టలేదు. అతను తన భార్యను ఒకటికి రెండుసార్లు, "మన అమ్మాయి నగతో సిద్దయ్య ఇంటికిగాని వెళ్ళిందా?" అని అడిగాడు.

రహస్యం బయటపడితే తనను భర్త చంపేస్తాడని, వీరాచారి భార్య లేదన్నది.

వీరాచారి తన అల్లుడికి క్షమాపణ చెప్పుకుని, తాను కాజేసిన సిద్దయ్య బంగారంతో నగ చేసి ఇస్తానన్నాడు.

"వద్దులే, మామయ్యా! మళ్ళీ కక్కుర్తి పడతావు. వ్యాపార రహస్యం నాకు మాత్రం తెలీదా? నేనే చేయిస్తానులే మా యింట్లో!" అంటూ వీరాచారి అల్లుడు వీరాచారి వద్ద బంగారం తీసుకుని, తన ఇంటికి వెళ్ళిపోయాడు.





# వీర హనుమాన్

రావణుడు లంకాయాగం చేస్తున్న సంగతి విభీషణుడికి తెలిసింది. అతను రాముడి తోనూ, వానరవీరులతోనూ ఇలా అన్నాడు: "రావణుడు చేసే హోమం పూర్తి అయిన పక్షంలో, అందులోనుంచి ఉక్కు శరీరాలు గల యోధులూ, చతురంగ బలాలూ పుట్టుకొస్తాయి. అప్పుడు రావణుణ్ణి జయించటం అసాధ్యం. అందుచేత యాగాన్ని భగ్నంచెయ్యాలి."

కాని అది ఎలా జరగాలన్నది సమస్య అయింది.

"అంగదుడికి అదృశ్యకరణి అనే విద్య తెలుసు. దాని సహాయంతో అతను రావణుడి హోమం సాగకుండా చెయ్యా వచ్చు." అన్నాడు జాంబవంతుడు.

అదృశ్యకరణి ప్రభావంతో అంగదుడు ఎవరికీ కనబడకుండా రావణుడి అంతః పురం ప్రవేశించి, మండోదరిని కొప్పు పట్టి ఈడ్చుకుంటూ రావణుడున్న చోటికి వచ్చాడు. అది చూసి కూడా రావణుడు యాగదీక్ష నుంచి లేవలేదు. అంగదుడు మండోదరిని ఇంకెక్కడికో ఈడ్చుకు పోసాగాడు.

"మూడు లోకాలనూ జయించినవాడి భార్యను ఇప్పుడు కాపాడేవారు లేరా?" అని మండోదరి ఆర్తనాదం చేసింది. రావణుడు ఇక భరించలేక యాగదీక్ష వదిలిపెట్టి లేచాడు. అదృశ్యుడుగా ఉన్న అంగదుడు మండోదరిని వదిలిపెట్టి, చల్లగా జారుకున్నాడు.

**30. రామలక్ష్మణుల అపహరణ**



51



''ఇప్పటికైనా రాముడితో సంధి చేసుకో,'' అని మండోదరి రావణుడికి సలహా ఇచ్చింది.

ఒకప్పుడు తన బలమూ, తనకున్న అంగబలమూ చూసుకుని రాముడితో యుద్ధం చేయ నిశ్చయించిన రావణుడు, ''బంధుమిత్రులనూ, తమ్ముణ్ణీ, కొడుకులనూ పోగొట్టుకుని, ఇప్పుడు క్షుద్రుడిలాగ రాముడితో సంధి చేసుకోమంటావా? రాముడు నన్ను చంపుతాడన్న నమ్మకంతోనే గదా ఈ సలహా ఇస్తున్నావు? రాముడు నన్ను చంపాడన్న కీర్తి పొందకుండా నేనే ప్రాయోపవేశం చేసి, యోగమార్గాన కపాలం భేదించుకుని ప్రాణత్యాగం చేస్తాను. నన్ను చంపి, విభీషణుడికి పట్టం గట్టుతానని ప్రతిజ్ఞ చేసిన రాముడు నన్ను చంపలేదు గనక ప్రతిజ్ఞాభంగం చేసినవాడవుతాడు. విభీషణుడికి రాజ్యం రాదు. నన్ను చంపి సీతను తీసుకుపోతానన్న ప్రతిజ్ఞ కూడా భంగమవుతుంది. రాముడు దొంగలాగా వచ్చి తన భార్యను ఎన్నడూ తీసుకుపోలేడు. నేను పోయినాక మీరంతా సహగమనం చేసేటప్పుడు సీతను కూడా చితిలోకి నెట్టండి. సీతా వియోగంతో రాముడు చస్తాడు.'' అని మతిభ్రమ కలిగినవాడిలాగా పడమటి దిక్కుగా వెళ్ళాడు.

లంకలో ఇలా ఉండగా, లంకకు సహస్రయోజనాలు దిగువన ఉన్న పాతాళలంకలో మరొక కథ జరుగుతున్నది.

పాతాళలంకను ఏలేవాడు మైరావణుడు. అతను గొప్ప మంత్రశక్తులు గలిగి, మాయలు తెలిసినవాడు. అతని అన్న అహిరావణుడు.

మైరావణుడు నాగలోకం నుంచి వాసుకి కుమార్తె అయిన చంద్రసేనను తన మాయతో ఎత్తుకొచ్చి, తనను పెళ్ళాడమని నిర్బంధించసాగాడు. చంద్రసేన అసమాన సౌందర్యవతి. ఆమె రాముణ్ణి వరించి, అతనే తన భర్త అని మైరావణుడితో అన్నది. సీతా స్వయంవరానికి ఆమె

నాగుల వెంట వెళ్ళి, రాముణ్ణి చూసినది మొదలు అతని విగ్రహాన్ని ఆరాధిస్తూ వస్తున్నది

లంకలో రావణుడు పడమటి తీరానికి చేరుకుని, అక్కడ దర్భలు పరిచి, వాటి మీద పడుకుని, ప్రాయోపవేశానికి సిద్ధమయాడు.

అప్పుడు నారదుడు అటుగా వచ్చి, ''ఇదేం పని, రావణా? నువు తోడులేని వాడివైపోయావా? నీ మిత్రుడూ, నీకు సోదరుడిలాటివాడూ అయిన మైరావణుణ్ణి మరిచావా?'' అని హెచ్చరించి, వెళ్ళిపోయాడు.



ఈ మాట వింటూనే రావణుడు నూతనోత్సాహంతో లేచి కూర్చుని, కళ్ళు మూసుకుని మైరావణుణ్ణి తలచుకున్నాడు. ఆ సమయంలో మైరావణుడు చంద్రసేన వద్దకు వచ్చి, ఆమె ఆరాధిస్తున్న రాముడి విగ్రహాన్ని లాగేసి, ''ఈ రాముణ్ణి తెచ్చి కాళీమాతకు బలి ఇస్తాను,'' అన్నాడు.

''ఆ రాముడే నిన్ను చంపేస్తాడు,'' అన్నది చంద్రసేన.

"నన్ను చంపటం తేలిక అనుకున్నావా? ఈ పాతాళలంకకు వెయ్యియోజనాల దిగువన ఒక భయంకరమైన గుహలో, ఒక రత్నపేటికలో అయిదు తుమ్మెదల రూపంలో నా ప్రాణాలున్నాయి. పేటిక తెరిచి, ఝుమ్మని పైకి వచ్చే అయిదు తుమ్మెదలనూ ఒక్కసారిగా చంపితేనే గాని నేను చావను. ఆ భయంకర గుహను అతిభయంకర పిశాచాలు రక్షిస్తున్నాయి. నా ప్రాణాలను తీయగలవాడు మూడు లోకాలలోనూ లేడు,'' అంటూ మైరావణుడు రాముడి విగ్రహాన్ని నేలకేసి కొట్టి ముక్కలు ముక్కలు చేశాడు.

ఆ క్షణంలోనే అతనికి రావణుడు తనను తలుచుకోవటం తెలిసింది.

రావణుడు కళ్ళు తెరిచేసరికి, భూమిని చీల్చుకుని వచ్చి, తన ఎదట నిలబడిన మైరావణుడు కనిపించాడు. ఇద్దరూ కౌగలించుకున్నారు.



రావణుడు మైరావణుడితో రామ, లక్ష్మణుల సంగతి చూడమన్నాడు.

"నాకు కావలసినదే నువూ అడిగావు. రేపు ఆ రామలక్ష్మణులను కాళికి బలి ఇచ్చేస్తాను," అన్నాడు మైరావణుడు. రావణుడు సంతోషించి, మైరావణుణ్ణి తన మందిరానికి తీసుకుపోయాడు.

చారుల ద్వారా విభీషణుడికి ఈ సంగతి తెలియవచ్చింది. అప్పటికి రాత్రి అయి పోవటం వల్ల రామ, లక్ష్మణులు నిద్రకు ఉపక్రమించబోతున్నారు. విభీషణుడు వానరుల వద్దకు వచ్చి, మైరావణుడి సంగతి చెప్పి, "మైరావణుడు రామ, లక్ష్మణులను అపహరించకుండా మనం కాపాడాలి," అని హెచ్చరించి వెళ్ళి పోయాడు.

హనుమంతుడు వెంటనే తన తోకను పెంచి, రామ, లక్ష్మణుల చుట్టూ ఒక కోటలాగా చుట్టాడు. తరవాత అతను ఆ తోకచుట్ట మీద ఎక్కి కూర్చుని, ఒక్క చీమ అయినా లోపలికిపోకుండా జాగ్రత్తగా చూస్తున్నాడు.

కొంతసేపటికి విభీషణుడు మళ్ళీ వచ్చి, హనుమంతుడి శ్రద్ధను మెచ్చుకుని, ఒక్క సారి తాను లోపలికి వెళ్ళి, రామలక్ష్మణుల చేతులకు రక్షాబంధాలను కట్టవలసి ఉన్నదని చెప్పాడు. హనుమంతుడు తన తోకను సడలించి, విభీషణుడు లోపలికి పోవటానికి దారి ఇచ్చాడు.

విభీషణుడు తన పని పూర్తిచేసుకుని బయటికి వచ్చి, "హనుమంతుడా, ఆ మాయలమారి మైరావణుడు నా రూపంలో గాని, మనలో మరొకరి రూపంలో గాని వచ్చి మోసం చేయగలడు, జాగ్రత్తసుమా!" అని హెచ్చరించి వెళ్ళి పోయాడు.

అతను అన్నట్టే కొంతసేపటికి విభీషణుడు మళ్ళీ వచ్చాడు. హనుమంతుడు అతని గొంతు పట్టుకుని, గదతో చావగొట్ట బోయాడు, "మైరావణుడా, నీ జిత్తులు నా దగ్గిరనా?" అంటూ.

"అయ్యో, వెర్రివాడా! మోసం జరిగిందా? మైరావణుడు నా రూపంలో వచ్చాడా? రామ, లక్ష్మణులను వాడు ఎత్తుకుపోలేదు గదా?" అన్నాడు విభీషణుడు. హనుమంతుడు తన తోక చుట్టలోకి చూస్తే రామ, లక్ష్మణులు లేరు!

హనుమంతుడు నీరుగారిపోయి, చతికిల బడ్డాడు. అప్పుడు జాంబవంతుడు, "లే, లే! రామ, లక్ష్మణులను రక్షించ గలవాడివి నువు ఒక్కడివే!" అన్నాడు.

హనుమంతుడు విభీషణుడి ద్వారా పాతాళలంకకు ఎలా వెళ్లాలో తెలుసుకుని, శరీరాన్ని పెంచి, ఆకాశంలోకి ఎగిరాడు.

ఈలోపల, విభీషణుడి రూపంలో రామ, లక్ష్మణులను చేరిన మైరావణుడు, వారిద్దరినీ చిన్న ప్రతిమలుగా మార్చి, తన బట్టల చాటున దాచి, పాతాళలంకకు చేరుకుని, రామలక్ష్మణులను చంద్రసేనకు చూపించి, "ఇడుగో నీ రాముడు! ఇతడు అతని తమ్ముడు. వీళ్ళిద్దరినీ రేపు కాళికి బలి ఇచ్చి, నిన్ను పెళ్ళాడేస్తాను," అని వికటాట్టహాసం చేసి, రామ, లక్ష్మణులను బంధించాడు.

హనుమంతుడు పడమటి సముద్రంలోకి చొచ్చుకుపోయి తామర మొగ్గ ఆకారంలో ఉండి, నిప్పుకణిక లాగా మెరిసే పర్వతాన్ని చూశాడు. హనుమంతుడు ఆ పర్వతశిఖరాన్ని చేరి, అక్కడ ఉన్న సన్నని బిలాన్ని చూసి, సూక్ష్మ రూపంలో ఆ బిలంగుండా దిగి వెళ్ళాడు. ఆ బిలం అతన్ని పాతాళలంక సింహద్వారం వద్దకు తీసుకుపోయింది.



ఆ ద్వారాన్ని మహాబలుడైన యువకుడొకడు కాపలా కాస్తున్నాడు. బల పరాక్రమాలు ఉట్టిపడే ఆ ద్వారపాలకుణ్ణి చూసి, హనుమంతుడు ఎంతో ముచ్చట పడ్డాడు. ఆ క్షణంలో అతడికి, ఆ యువకుడి మీద ఒక విధమైన వాత్సల్యం కలిగింది.

హనుమంతుడు సూక్ష్మ రూపంలో వున్నా, ద్వారపాలకుడైన యువకుడు



అతణ్ణి గుర్తించి, ''ఎవడవురా నువ్వు? నా కన్నుగప్పి సింహద్వారం దాటి పోవాలనుకుంటున్నావా? ఇదిగో, నీకు చావు మూడింది!'' అంటూ పిడికిలి బిగించి, హనుమంతుడి మీద కలబడ్డాడు.

ద్వారపాలకుడి బల పరాక్రమాలు చూసి హనుమంతుడు ఆశ్చర్యపోతూ, "వీడెవ్వడోగాని, నాతోసమానంగా పోరాడగలుగుతున్నాడు. ఇలాంటి వాణ్ణి కొంచెం మరిపించి, హతం చేయాలి,'' అనుకుంటూ, అలసిపోయిన వాడిలా చతికిలబడ్డాడు.

తన శత్రువు నీరసించి పోయాడనుకుని, ద్వారపాల యువకుడు ఉత్సాహంతో పెద్దగా నవ్వుతూ, ''ఓరీ మాయావీ! నేనెవ్వడనుకుని, నాతో యుద్ధానికి వచ్చావు? నా పేరు మత్స్యవల్లభుడు. వీరాగ్రేసరుడైన హనుమంతుడు, నా తండ్రి. తెలుసా?'' అన్నాడు.

యువకుడిలా అనగానే హనుమంతుడికి ఆశ్చర్యంతోపాటు కోపం కూడా కలిగింది. అతడు పళ్ళుకొరుకుతూ, ''ఓరీ, చేపలవాడా! జగమెరిగిన బ్రహ్మచారి హనుమంతుడు, నీ తండ్రా? ఇలాంటి అబద్ధపు కూతలు కూసినందుకు, నీకు చావు తప్పదు!'' అంటూ మత్స్యవల్లభుడి మీదికి లంఘించాడు.

హనుమంతుడు బలమైన పిడికిటి పోటులతో యువకుణ్ణి చంప చూస్తున్నంతలో, వెనకనుంచి, "స్వామీ, తొందరపడకండి, ఆగండి!'' అన్న కేక వినిపించింది.

హనుమంతుడు చప్పున తల తిప్పి చూశాడు. మెరుపులాంటి సౌందర్యవతి ఒకామె అతడి కేసి పరుగు పరుగున వస్తూ కనిపించింది. ఆశ్చర్యపోతూ నిలబడిన హనుమంతుడి పాదాలకు నమస్కరించి, ఆమె, ''వాడు చెప్పింది సత్యమే! నా పేరు సువర్చలాదేవి. దక్షిణ సాగరుడు నా తండ్రి. అసంఖ్యాక జలచరాలకు నేను రాణిని. నన్ను, నీవు ఎరగవుగాని; నిన్ను నేను ఎరుగుదును. ఒకసారి నువ్వు



# ప్రతీకారం

అనేక శతాబ్దాల క్రితం ఉత్తర భారత రాజ్యాల మీద విదేశీయ దండయాత్రలు జరిగేవి. పోరాటాలు దారుణంగానూ, అమానుషంగానూ ఉండేవి. ఒక్కొక్కప్పుడు దాడి చేసినవాళ్ళు భారతీయ దుర్గాలను భేదించేవారు, ఒక్కొక్కప్పుడు పరాజితులయేవారు.



బాగ్దాదులో ఉండే ఖలీఫాకు ప్రతినిధిగా అల్ హజాజ్ టర్కీ, ఇరాన్ దేశాలను పాలించేవాడు. అతను సింధురాష్ట్రం మీద తన సైనికుల చేత చాలాసార్లు దాడి చేయించాడు. కాని ప్రతిసారీ వాళ్ళు అపజయం పొందారు. అప్పుడు సింధు రాజు దహిర్.



సముద్రాన్ని లంఘిస్తున్నప్పుడు సింహిక, నీ నీడను పట్టి లాగగా, నువు దానితో పోరాడసాగావు. ఆ సమయంలో నేను మత్స్యశరీరంతో, సముద్రం మీద తేలుతున్నాను. నువు, సింహికను చంపి, నీ నొసటపట్టిన చెమటను వేలితో తీసి విదిలించావు. ఆ చెమట బిందువు, నా నోటిలో పడింది, నేను మింగాను. ఆ కారణంగానే నేను గర్భవతినయి, యీ మత్స్యవల్లభుడిని కన్నాను. అందువల్ల యితడు నీ కుమారుడే!'' అన్నది.

ఆమెమాట ముగించేసరికి, ''హనుమా! సువర్చల చెప్పినదంతా నిజం. మత్స్యవల్లభుడు నీ కుమారుడే!'' అంటూ దివ్యవాణి పలికింది.

ఇంకా ఆశ్చర్య సంభ్రమాల నుంచి తేరుకొనని హనుమంతుడితో, సువర్చలాదేవి యిలా చెప్పింది: ''మత్స్యవల్లభుడు బాల్యంనుంచే ధైర్యసాహసాలు కలవాడు. మహా పరాక్రమశాలిగా ఫెరిగి పెద్దవాడవుతున్న అతణ్ణి, మైరావణుడు ఎత్తుకుపోయి, తన బానిసగా చేసుకున్నాడు. నీ దర్శనంతోగాని, వాడికి దాస్యవిముక్తి కలగదని దివ్యవాణి చెప్పింది. నీదర్శనం కలిగింది; మత్స్యవల్లభుడికి యీనాటితో దాస్యం తొలగిపోయింది.''

''సువర్చల చెప్పినదంతా నిజం. మత్స్యవల్లభుడు హనుమంతుడి కుమారుడే!'' అని దివ్యవాణి మరొకసారి పలికింది.

మత్స్యవల్లభుడు, హనుమంతుడికి ప్రణమిల్లాడు. హనుమంతుడు అతణ్ణి భుజాలుపట్టి లేవనెత్తి, గాఢాలింగనం చేసుకున్నాడు.

సువర్చలాదేవి ఎంతో సంతోషపడిపోతూ హనుమంతుడితో, ''నువు చంద్రసేన దగ్గిరకు వెళ్ళు. మైరావణుడి ప్రాణ రహస్యం ఆమెకు తెలుసు. నీకు అన్నివిధాలా సహాయం చేస్తుంది.'' అని హనుమంతుడికి నమస్కరించి, మత్స్యవల్లభుడిని వెంటబెట్టుకుని, వెళ్ళిపోయింది.





చిట్టచివరకు అల్ హజాజ్ అల్లుడు మహమ్మద్ కాసిమ్ సేనాధిపతి అయాడు. అతడు సాహసమూ, బుద్ధి బలమూ గలవాడు. దీర్ఘ పోరాటం జరిపి అతను సింధు రాజు దుర్గాన్ని ఛేదించ గలిగాడు.

రాజూ, రాజకుమారులూ చనిపోగా, రాణీ, ఆమె కోడళ్ళూ చితి పేర్చుకుని అందులో ఆత్మార్పణ చేసుకున్నారు.





కాని రాజకుమార్తెలు ఇద్దరు, మంచి అందగత్తెలు, అగ్నికి ఆహుతి అయే లోపుగా కాసిమ్‌కు దొరికిపోయారు.



సేనాధిపతి రాజుగారి బొక్కసం కొల్ల గొట్టి, స్వదేశానికి బయలుదేరాడు. రాజ కుమార్తె లిద్దరినీ అతను తన వెంట తీసుకుపోతూ, చాలా గర్వపడ్డాడు.



సేనాధిపతి కాసిమ్ రాజకుమార్తెలను తన మామ అయిన అల్ హజాజ్‌కు సమర్పించగా, ఆయన వారిని ఖలీఫాకు పంపాడు. ఖలీఫా వారి సౌందర్యానికి ముగ్ధుడై, వారిని తన జనానాలో ఉంచి, సేనాధిపతిని ఒక దూర ప్రాంతానికి పాలకుడుగా నియమించాడు.



కొంతకాలం గడిచినాక ఖలీఫా తాను రాజకుమార్తెలను పెళ్ళాడబోతున్నట్టు ప్రకటించాడు. కాని రాజకుమార్తెలు, తమను దారిలో సేనాధిపతి పెళ్ళాడాడని చెప్పి, "తమ భార్యలను తమ యజమానులకు బహూకరించటం మీ దేశాచారమా ?" అని అడిగారు.



ఖలీఫా మండిపడి, దూర ప్రాంతంలో పాలకుడుగా ఉన్న కాసిమ్‌ను తీసుకు రమ్మని తన భటులను పంపుతూ, "ప్రాణాలతో కాదు. నేను వాడి శవాన్ని చూస్తాను!" అన్నాడు.



ఖలీఫా ఆజ్ఞ అమలుజరిగింది. కాసిమ్ శవం ఖలీఫా ముందుకు రాగానే రాజ కుమార్తెలు, "ఖలీఫాగారూ, సేనాధి పతి మమ్మల్ని తాకనైనా లేదు. మా తండ్రి చావుకూ, అతని వంశం అంతమైనందుకూ మేం పగ తీర్చు కున్నాం. అంతే!" అన్నారు.



మోసపోయిన ఖలీఫా అరిచి, కేకలుపెట్టి రాజకుమార్తెలను చంపించాడు. అందుకు వారు సిద్ధంగానే ఉన్నారు. కాసిమ్‌ను చంపించిన విచారంతో కుమిలి, త్వరలోనే ఖలీఫా కూడా మరణించాడు.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

**?**

కిచియోము అనే జపానువాడు ఒకనాడు తన భార్యను పిలిచి, "మన పంచలో మేకు పొడుచుకు వచ్చింది. చాలా ప్రమాదం! దాన్ని అణగగొట్టాలి. మన పక్క ఇంటికిపోయి, కాస్త సుత్తె తీసుకురా!" అన్నాడు.

అతని భార్య వెళ్ళి ఉత్త చేతులతో తిరిగివచ్చి, "పక్క ఇంటికి వెళ్ళి, మేకు అణగ గొట్టటానికి కాస్త సుత్తె ఇస్తారా అని అడిగాను. ఏం మేకు? వెదురు మేకా? కొయ్య మేకా? ఇనప మేకా? అని అడిగారు. ఇనపమేకేనని చెప్పాను. 'అలా అయితే మా సుత్తె చెడిపోదా? మేం ఇయ్యం!' అన్నారు," అని భర్తకు చెప్పింది.

కిచియోము ముఖం చిట్లించి, చీదరింపుగా, "నిజంగా ప్రపంచంలో ఎలాటి పిసినారి వెధవలుంటారో! సరే, ఏం చేస్తాం? తప్పేదేముంది? మన సుత్తే తీసుకురా!" అన్నాడు.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు మార్చి 20 లోగా చేరాలి. అందులో ఫొటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, '77 మే చందమామలో ప్రకటించబడతవి.

---

జనవరి నెల పోటీ ఫలితం: మూర్ఖత్వానికి మందులేదు.

గెలుపొందిన వారి పేరు: మిస్. జి. ఆర్. వి. నందిని. గవర్నర్ పేట, విజయవాడ-2

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1977 మే నెల సంచికలో ప్రకటింపబడును.



A. S. Anbukkarasu



A. S. Anbukkarasu

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ మార్చి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఒకరు పెంచింది కాదు

రెండవ ఫోటో : ఒకరు తుంచంది రాదు

పంపినవారు : బెందడి బాబుకుమార్, కమాన్ బజార్, ఖమ్మం.

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

బబుల్ గమ్




బుడగలు




NP

007

బబుల్ గమ్
డబుల్
బబుల్ గమ్

బుడగ తరువాత

బుడగ తరువాత బుడగ అదే మజా ...

ఎన్‌పి ఎల్లప్పుడూ
ఉత్తమమే.







ది నేషనల్ ప్రోడక్ట్సు
బెంగుళూరు 560 006.

Dattaram NP-5H-TELUGU

